శ్రీరస్తు

# దీనబంధు

(అయిదంకముల సాంఘిక నాటకరాజము)



గ్రంథకర్త:

సకల శాస్త్రప్రవీణ, చతుర్భాషాకవితాధురంధర, బహు గ్రంథకర్తలగు
కీర్తిశేషులైన, బాబూ పి. యస్. నౌషర్‌వాంజి కవిగారి పుత్రుండగు
సకల రత్నశాస్త్రప్రవీణ, సంగీత సాహిత్యవిద్యాధురీణ, రసతాంత్రిక,

బాబూ యస్. జైసింగ్ కవి.



బ్రహ్మశ్రీ రామగిరి కోటయారాధ్యుల వారిచే పరిష్కరింపబడియె.

 [వెల రు. 2—4—0

# అంకితము

పరమాత్మకు

దీనబంధునాటక కీర్తనలు ప్రత్యేకముగా అచ్చగుచున్నవి.
వివరములకు వ్రాయుడు.

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

పురుషులు :

1. జీవనరావు—కథానాయకుడు
2. గోపాలం—శ్రీకరం (భ్రష్టుడు), విటుడు
3. రాముడు—సానితమ్ముడు
4. అమృతానందుడు—దొంగగురువు
5. హరిరాం—దొంగశిష్యుడు
6. సత్యానందుడు—సత్యసంధుడు, ధర్మాత్ముడు
7. సారంగపాణి—సత్యానందుని శిష్యుడు
8. వెంకటేశం—నవరముల వ్యాపారి
9. డాక్టరు—జపాను దేశీయుడు
10. పోలీసుఉద్యోగి
11. నవజీవన్—జీవనరావుకుమారుడు

(కొందరు పోలీసుజవానులు, కొందరు జూదరులు)

స్త్రీలు :

సుగుణ—కథానాయకి - జీవనరావుభార్య

మంజువాణి—వేశ్య

# నోటీసు

ఈ నాటకముయొక్క ప్లాటు, పద్యములు, సంభాషణలు, పాటలు, స్వరము, కళ్యాణ్ సినీటోన్ కార్పొరేషన్ వారి వెండి తెరకుగాను, నాచే సృష్టింపబడినవి. ఈ నాటకము ఇండియా కాపీరైటు యాక్టు ప్రకారము, సర్వహక్కులు నాకే చెంది యున్నవి. కాన నా అనుమతి పొందనిదే యెవ్వరూ యీ నాటకమును ప్రదర్శించుటకుగాని, పబ్లిక్, ప్రయివేట్ సభలలో వెల్లడిచేయుటకుగాని, వేఱొక భాషలో తర్జుమా చేయుటకుగాని టాకీ స్క్రీనింగ్, రికార్డింగ్ రేడియో మొదలగువాటియందు వుపయోగపరచినచో మాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు,

ప్రొఫెసర్. యస్. జైసింగ్ కవి.

N.B. 6వ నెంబరు పేజీలోగల సీసపద్యమున పాఠకులు యీ పాదముచేర్చి చదువవలయును.

'పనిపాట లెరుగని ♦ పలుచని కరముల
నారతాళ్లను పేన ♦ నరుగమనెదొ'

# పీఠిక

సారస్వతాన్ని ఆరాధిస్తూ అందులో వుండే ఆనందాన్నిగూడా అనుభవించేవారు విద్యార్థికులే! నిరక్షరాస్యతను నిర్మూలింప గలిగి ఆత్మోద్ధరణకు, సంఘోద్ధరణకుగూడాతోడ్పడగల సాధనగా నాటకాన్నెన్నడో మన పూర్వులే సృష్టించారు. కనుకనే 'కావ్యేషు నాటకం రమ్యం' కావ్యప్రపంచంలో దృశ్యకావ్యమైన నాటకమే రమ్యమయినదిగా యెన్నుకోబడ్డది. అయితే దృశ్యకావ్యంలో రసానికి యెంతప్రధాన్యమో విషయానికి అంతే ప్రాధాన్యం ఉంటుంది.

నాటకాలలో కొన్ని ప్రదర్శనానికి, కొన్ని పఠనకు మాత్రం వుపయోగపడుతూ ఉన్నాయి. పఠన కుపయోగపడే నాటకాలలో గ్రాంధిక పదగుంభన అల్లిక జిగి విద్వత్కవితా ధోరణికే ఆధిక్యత గలిగి రంగస్థలానికి కావలసినరచనారహస్యం అనుభవం అందులో లేకపోవటమే కారణం. రంగస్థలానికెక్కిన భావకాంతను యెల్లరు ఆలింగనంచేసుకోనగలరా? కాబట్టి పండిత, పామర ప్రేక్షకాళిని యేకంగా ఆనందవాహినిలో నోలలాడించగల రచనా విధానంతో గూడిన దృశ్యరంగాంకముల నిర్మాణ సమ్మేళనా చాతుర్యం, భాష, శక్తి యెంతో అవసరం ఉండబట్టి ఈ 'దీనబంధు' స్వరూపాన్ని వ్యావహారికంలో ఉండే దేశీయకుంచెతో చిత్రించాను. దీనికి కావలసిన రంగులు మెరుగులు సాంఘిక జీవితంలో స్వయంగా కన్నవి, విన్నవి, కొన్ని యపూర్వ ఘట్టాలను క్రోడీకరించి రచన పూర్తిచేసి ఆంధ్ర సోదరుల కందచేయగలిగాను. ఇందుగల ప్రమాదాది దోషాలను రసజ్ఞులు పాటింపక ద్వితీయ ముద్రణమునకు దోడ్పడువారికి నమోవాకములు.

ఇట్లు

గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు

దీనబంధులను నీనాటకము నవీనకాలమున వ్రాయబడినది. నీతిని బోధించుచు, దురభ్యాసములను విమర్శించుచు, చక్కగా కథ నడుప బడినది. పాత్రపోషణము చక్కగానున్నది. ప్రదర్శనమున కత్యంతోప యుక్తముగానుండి ప్రేక్షకులకు ఆనందము కలిగించుననుటకు సందియము లేదు. ఇక్కాలమున కిది, మహోపయోగము నొనగూర్చు ననుటకు సందియము లేదు.

అందందు పొందుపరచిన పద్యములు, సభ్యుల నందఱ నానందమున ముంచివేయగలవు. మొత్తముమీద నీ నాటకము కాలోచితముగ నుపయుక్తముగా నున్నది. ఈనాటకమును రచించిన మహారాజరాజశ్రీ బాబు యస్. జయసింగ్ కవిగారికి భగవంతుడు ఆయురారోగ్యములు ప్రసాదించుగాత యని వారక కోరుచున్నాను.

ఇట్లు,

అభినవ ఆంధ్రవాల్మీకి, శాస్త్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ మహామహోపాధ్యాయ,

జనమంచి శేషాద్రిశర్మ

7—9—46

కొన్ని పురాణగాధలు నిత్యనవీనాలు. కొన్ని ఎంత నవీనంగా కన్పించినా అవి పాతరోజుల చీకుకథలులా కన్పిస్తాయి.

దీనబంధు నాటకం భారతదేశం సర్వప్రపంచానికీ అర్పించే ఉత్కృష్టాశయమైన ఇతివృత్తము. ఇది నిత్యము ఎంత నికృష్టునికైనా ఎంత పతితునకైనా, ఉత్తమజీవితం ఉంది. అది ఆ పతితుడైనా, తానే సంకల్పించుకొని నిర్మించుకోవాలి. లేదా ఏదో మహత్తర సన్నివేశం జరిగి ఆపథం నిర్మించుకొనేశక్తి వానికి రావాలి.

ఇదే దీనబంధులోని చక్కనిగాథ! 'దీనబంధునాటకం' నాటక లక్షణాలు సులక్షణమై ఇందులో ఒప్పుతున్నవి.

నాటకమైనా, నవలైనా కథ చెప్పాలి. ఆ కథ దృశ్య ప్రదర్శనంగా నాటకకర్త విన్యసించాలి. అప్పుడే ఉత్తమనాటకం సృష్టి అవుతుంది.

దీనబంధులోని కథ అద్భుతంగా నడిచింది. జీవనరావు కథానాయకుడు. సుగుణ కథానాయకురాలు. వీరివెనుక ఉన్నశక్తి సత్యానందుడు. సత్యానందుడే 'దీనబంధు' అయినా ఆ దీనబంధుత్వ మహాదాశయం ఒక ప్రత్యేక వ్యక్తిని ఉత్తమపురుషునిగా చేయాలి. ఆ వ్యక్తి పతితుడై పవిత్రుడవ్వాలి. పతితుడు, పవిత్రుడవడమే ఈ నాటక ముఖ్యవస్తువు.

పతితుని లక్షణాలు, త్రాగుడు, జూదము, పణ్యస్త్రీలు, దొంగతనము, అయినా కథానాయకునిలో అంతరాంతరాల ఎరగని ఉత్కృష్టత ఉంది. అదేఅని జూదరులలో మొనగాడు త్రాగుడులో మేటి పణ్యస్త్రీలు వాంఛించే విట్రాగ్రేసరున్ని చేస్తుంది. కథానాయకుడు పట్టుబడి అయిదేళ్ళు కారాగారవాసం చేస్తాడు.

భార్యా పుత్రులు యెన్ని కడగండ్లయినా పాలవుతారు. విడుదల అయినవెనుక జీవనరావు కుమారునే దోచుకుంటాడు, దీనుడైన ఆబాలుని కొట్టినాడు. దీనబంధు ఆశ్రమంలో చేరుతుంది సుగుణ పుత్రునితో!

ఆ దీనబంధునే దోస్తాడు. జీవనరావును పోలీసులు పట్టుకుంటే దీనబంధు తానే జీవనరావుకే ఆ వస్తువులు ఇచ్చినానంటాడు. ఇది హ్యూగో మహాకవి వ్రాసిన 'దురదృష్టవంతులు' అన్న నవలలో కథాంశాన్ని పోలుతుంది. ఈ మహత్తర సన్నివేశమే జీవనరావుని మార్చివేస్తుంది. పతితుడు పవిత్రుడౌతాడు.

సంభాషణలు చక్కగా నడిచాయి. కథ పట్టుతప్పక ప్రవహించింది.

ఇక పద్యాలు పాటలు నాటకానికి అవి అడ్డుపెట్టలేదు. ఈ నాటకం మహోత్తమం. అన్నిరసాలు ఎంతో అందంగా ప్రకాశించిన ఈనాటకం చదవడం నాకు చాలా సంతోషం కూర్చింది.

19—10—46
హైదరాబాదు

ఇట్లు,
అడివి బాపిరాజు, బి ఎ. బి ఎల్.
కవి, చిత్రకారుడు.
*EDITOR, MEEZAN (Telugu)*

ఈ గ్రంథ ముద్రణమునకు వలయు ధనమును బహూకరించిన
జనగామ నివాసులును, సుప్రసిద్ధ వ్యాపారులును, మన్మిత్రులగు
మహారాజశ్రీ కవకోటి రామయ్య శ్రేష్ఠిగారి యొక్కయు
వారి కుమారులయొక్కయు ప్రశంస.

సీ. కవివర రమ్మని ♦ కరమెత్తి జీరుచు, కావ్యంబు గాంచకే ♦ కట్న మొసగు
పండితవరుబల్కు ♦ భక్తుల గాథలన్, ననుచు చెవియొగ్గి ♦ యాలకించు
విద్వాంసుడవుగాన ♦ వినుపింప రాదొకో, మధురమౌ సుధబోలు పదము లనును
మిత్రుల మాటచే మీసేవ మారయు, మావిధి యనుచు తా ♦ మందలించు

గీ. ఇట్టి కవకోటి రామయ్య ♦ సేవమీర, పుత్ర పౌత్రాభి వృద్ధిగా ♦ పుడమి యందు
కలిమి భోగాది భాగ్యముల్ ♦ కనికరించి, గాచు గావుత వాసవీ ♦ కన్యధన్య.

శ్రీ కవకోటి రామయ్యగారి జ్యేష్ట పుత్రులగు
శ్రీ కవకోటి బాబుగారి ప్రసక్తి.

చం. మరతురు కొండరిభువిని ♦ మానము గాచినవారినేని నే
మరువవు మమ్ము నీవు నొక ♦ మాటను గాంచిన చెల్మినెంచుచున్
సురచిర భాష సాధుగుణ సుందర వేష వివేక భూషణా
నిరత పరోపకారి వగు నీ విల వర్ధిలు పుత్రుబాబువై.

గీ. లలిత కళలను పోషింప ♦ ఫలితమనుచు, జన్మతోడనె నేర్చిన చతురమతివి
యేది సత్పాత్ర దానంబొ ♦ నెరుగ జాలు మేటివనవచ్చు నిను కవకోటిబాబు.

శ్రీ కవకోటి రామయ్యగారి ద్వితీయ పుత్రులగు
శ్రీ కవకోటి యేకనాథంగారి ప్రసక్తి.

గీ. గురువు దైవంబు యననేమొ ♦ గుర్తెరింగి, పరమభక్తిని మెలగెడు ♦ పురుషుడనుచు
బుధులు కొనియాడ పుణ్యమౌ ♦ విధులు సల్ప లోకనాథుండు నిను గాచు నేకనాథ.

శ్రీ కవకోటి రామయ్యగారి ధర్మపత్నిగారి ప్రసక్తి

గీ. సాధ్వి కిష్టమ్మ పూజకున్ ♦ చాల మెచ్చి, కోటివిష్ణుంబు లిల కవ ♦ కోటి వంశ
కీర్తి చంద్రిక లలరారు వార్తిలేక, యనుచు నుడువగా ♦ సెలగిచ్చె నాదిశక్తి.

గీ. పొట్టకూటికి పొగడ నే భట్టుగాను, కనక మానించి యెన్నడు ♦ కల్లలాడ
కనుల గాంచిన సత్యముల్ ♦ కలముతోడ, సాక్ష్య మిప్పింతు నాజగత్ ♦ సాక్షి మెచ్చ.

ఇట్లు

ప్రొఫెసర్, బాబు యస్. జై సింగ్ కవి

# దీనబంధు

## ప్రథమాంకము

### ★ ప్రథమరంగము ★

స్థలము:—పోలీసు ఠాణాలోని ఆవరణము

(ప్రవేశము : కొందఱు పోలీసుజవానులు

వారివెనుక పోలీసు ఉద్యోగి యొకడు కవాతుచేయించుచు)

పోలీసు ఉద్యోగి: క్విక్ మార్చ్ (Quick march)

(జవానులు వరుసగా ముందుకు నడచెదరు)

పో॥ఉ—హాల్ట్ (Halt) (జవానులు నిలుచుందురు)

పో॥ఉ—లెఫ్ట్‌రైట్. లెఫ్ట్‌రైట్. (Left right, Left right)

పో॥ఉ—(మరల పైవిధముగా చేయించుచు) క్విక్ మార్చ్, (Quick-march) (జవాను లట్లుచేయుచుండ)

పో॥ఉ॥—రైట్ వీల్ (Right wheel)

పో॥ఉ—లెఫ్ట్ వీల్ (Left wheel)

పో॥ఉ—ఫారమ్ ఎ లైన్ Form a line) హాల్ట్ (Halt)

పో॥ఉ—లెఫ్ట్‌రైట్, లెఫ్ట్‌రైట్ (Left right, Left right) జవానులు పైవిధముగా చేయుచుండ వెంకటస్వామియును జవాను ప్రవేశించి, పోలీసు ఉద్యోగికి సెల్యూట్ (Salute) చేసి ఒక అర్జంటు ఆఫీసు కవరుసందిచ్చి ప్రక్కగా నిలుచుండును.)

పో॥ఉ—(కవరు నందుకొని జవానుల నుద్దేశించి) హాల్ట్ (Halt) (జవానులు నిలుచుందురు.)

పో॥ఉ—(కవరును చింపి యందలి లేఖను చదువుకొని) మంచిది; వెంకటస్వామీ! ధొరగారు ఎప్పుడు వస్తారు క్యాంపునుండి?

వెం—అయ్యా! ధొరవారు రేపు దయచేస్తామని సెలవిచ్చినారు.

పో॥ఉ—మంచిది (జవానుల నుద్దేశించి) 396 (మూడుతొంభైఆరు) 463 (నాలుగుఅరవైమూడు) 557 (అయిదుయాభైఏడు) మీరు నావెంట ఉండాలి. మిగిలినవారు స్టేషన్ పనులు చూచుకోండి. జూదరియై, త్రాగుబోతై, తుంటరియై, పోలీసువారిని లక్ష్యపెట్టకుండా ప్రజలకు ద్రోహముచేసే జీవనరావును బంధించవలసినదిగా అధికారిఆజ్ఞ అయింది.

వెం—అయ్యో, వాడు మంచి తెలివిగలవాడు. మనం ఏమాత్రం సందివ్వకుండా సంచరించాలి. సామాన్యుడా! అధికార్లను అల్లాడించిన అనుభవశాలి, వాడికోకస్థానం అంటూ నిలకడ వుంటుందా!

పో॥ఉ—అవును. వాడు ఎక్కడ దాగుకకపోయినా రాత్రి ఆ పచ్చ మేడలో జూదం ఆడటానికి వస్తాడుగా?

వెం—రావచ్చు తప్పక. అది లేకపోతే ఆదాయం ఎక్కడిది?

పో॥ఉ— (జవానులను సంబోధించి) నేను కోరినవాండ్లు ఈరాత్రి పదిగంటలకు సిద్ధం ఉండాలి జాగ్రత్త డిస్మిస్ (Dismiss)

(అనగానే జవానులు సెల్యూట్ చేసి నిష్క్రమింతురు)

(వారివెనుక పోలీసుఉద్యోగి, వెంకటస్వామియు నిష్క్రమింతురు)

## ★ ద్వితీయరంగము ★

(స్థలము పచ్చమేడ (జూదగృహము) అందు రెండు, మూడు తెగలుగా బల్లలపై సారాయిబుడ్లు, గ్లాసులు, సోడాలు, సిగరెట్ డబ్బాలు వగైరా వుంచుకొని జూదరులు పాడుచు, త్రాగుచు కూర్చొని యుందురు)

(ప్రవేశము : జీవనరావు)

జీవన—

సీ. ప్రత్యక్షదైవంబు ! భానుడొక్కడె చూడ
కామధేనువు కాదె ! కనకమఱయు
ప్రియ రంభోర్వసుల్ ! ఫిలుము తారల భువి,
కల్పతరువుగాదె ! కాఫి కేఫు

నరయుగా నరకంబు ! హాస్పిటల్ జగతిలో
స్వర్గంబె భువిలోని ! సానిగృహము
ఇంద్రుండు ధనికుండు ! నీలోకమునచూడ
అమృత కలశంబు ! నరఖుబుడ్డి
గీ॥ దివికి భువికిని భేదంబు ! తేలె నిచట
దేవ మానవ ధర్మముల్ దేటపడియె
(జేబునుండి తీసి సిగరెటును వెలిగించి)
ఒక్క సిగరేటు వెలిగించి ! ఊదివేతు
రక్తి నాసామ్ము యిటురమ్ము ! రమ్ము ఘుమ్ము.
(జేబునుండి రమ్ము సీసా తీసి త్రాగుచు)
ఈరోజు నంచి పూర్తిగా నిండడమో దమ్మిడీ మిగలకుండా ఖాళీకావడమో, జరిగితీరాలి. యీరోజు బాగా బలసిన పిట్టలే వాలాయి.

నెం. 1 జూదరి—జీవనరావు గారు లేందే, ఆటలో జీవ ముంటుందా?

నెం. 2 జూదరి— నిజం, నిజం. (అని జీవనరావును సంబోధించి) రారేమండి కళావరు రాజాగారు!

జీవన— ఆగండి. అర్జె ఆసుగారూ !

(జూదరులందరు నవ్వ - జీవనరావు పాటపాడుచు బల్లవద్దకు నడచుచుండ మిగిలినపాట జూదరులు పాడి ముగింతురు. - జీవనరావు బల్లవద్దకూర్చుండి రూపాయలసంచిని విప్పుచుండగా మిగిలిన జూదరు లందరు బల్లచుట్టు కూర్చుండి పేకను కలుపుచుందురు.)

నెం. 1 జూదరి— పేకముక్కలు గిల్లినా, గుర్తుపెట్టినా, వంచినా, యివ్వాళ, ఒకఖూనీ తప్పదు.

జీవన:—ఒక్క ఖూనీకాకపోతే ఒకడజను ఖూనీలు, నీకు లెఖేమిటి? కోపమువస్తే ఆపేవాడెవడురా! పచ్చమేడ (Gambling home) క్షణంలో కురుక్షేత్రం గాదా?

నెం.1 జూదరి—(పేకముక్కలను కలిపివేయును)

జీవన—గూటో. (Blind) 60 రూపాయలు

నెం. 2 జూదరి—చూచి నూటయిరవై.

నెం. 1 జూదరి— మూడువందలు

జీవన—(Five hundred) అయిదు వందలు

నెం.2 జూదరి—పారేశాను.

నెం. 1. జూదరి—అయిదువందలు.

జీవన—మళ్ళీ పంచావతారాలు. షో (Show) చూపరా?

జీవన— ఛీ, ఛీ, ఆసులపైరాజు-తీసుకో-

(మరల పేకముక్కలు కలిపి వేయుచుండగా, పోలీసులు ప్రవేశించి దాగియుందురు.)

జీవన—గూట్ (Blind) రెండు వందలు.

నెం. 2 జూదరి—మూడు వందలు.

జీవన—(Five Hundred) ఫైవ్ హాండ్రెడ్.

నెం. 2 జూదరి—చూచి పారేశాను.

నెం. 1 జూదరి—చూచి, వన్ థౌజండ్ (One Thousand) దశావతారాలు అంటే అక్షరాలా పది వంద నోట్లు.

జీవన—మరి ఒక వెయ్యి.

నెం. 1. జూదరి—(ఆలోచించి ముక్కలతో విసరుకొనుచు తలగీరుకొంటూ చేతరూపాయి నెగురవేసి శకునం చూచి) మరి ఒక వెయ్యి తిరగెయ్యి రాజా!

జీవన—అరే, మట్టికూజా, మూడు రాజులురా! ఛంకా!

నెం. 1 జూదరి:—(బల్లపై పేకముక్కలనుకొట్టి) ఛీ, ఛీ, తూ, తూ, మూడు జాకీలుతగలబడ్డయి. పందెంతీసుకో యింటికెళ్లియిప్పుడే డబ్బుపట్టుకొస్తాను. ప్రస్తుతం సంచి ఖాళీ!(అని లేచి ముందుకు పోవును.)

పోలీసులు—పట్టుకో! పట్టుకో! (ఈలలు వేయుచు కేకలువేసి యిద్దరు ముగ్గురు జూదరులను మాత్రము పట్టుకొందురు.)

పో-ఉ॥:— ముందు జీవనరావును పట్టు పట్టూ! పట్టుకో.

జీవన:—జీవనరావును పట్టగలవాడు నిర్జీవి గాగలడు. నన్ను పట్టగల వాడెవడురా! యిదిగో పట్టుకు పెట్టు. (అని కుర్చీనె త్తికొట్టి ఒక జవానును పడవేసి పారిపోవును - జూదగృహమంతయు అల్లకల్లోల మగును. అవనిక జారును.)

## ★ తృతీయ రంగము ★

స్థలము : జీవనరావుగృహము - జీవనరావుభార్య సుగుణ ప్రవేశము
(ప్రక్క మంచముపై జీవనరావుకుమారుడు నవజీవన్ నిద్రించుచుండును)

సుగుణ:—(నవజీవన్ ప్రక్కన కూర్చుండి జోకొట్టుచూ పాట.)
(జీవనరావు తూలుచు ప్రవేశము) (భార్య నుద్దేశించి)

జీవన- వెల్ డియర్ (Well Dear) సుగుణ! నీగానం నేటి మా విజయానికిచేసే పై వారంఅనుకొంటాను. బాబు నిద్రపోతున్నాడా?

సుగుణ—అవును! దయచేయండి, (కుర్చీని ముందుకులాగి, జీవనరావు చేతిలోనికఱ్ఱ, కోటు, తీసి ఆవలయుంచుచూ - ప్రకాశముగా) తమకు విజయముగాక, అపజయంఎప్పుడుకలిగింది? మీరు సదా గావించే దిగ్విజయ యాత్రలయందు, అపాయం వెనువెంట నడుస్తూవుంటుందనే భయం ఒక్కటితప్ప.

జీవన—తప్ప ఏమిటీ? తప్పక అపాయదేవత వెనువెంటనే నడుస్తూ వుంటుంది. అయితే ఏం? ధైర్యవంతునే విజయలక్ష్మి సదా వరిస్తూవుంటుంది. కాని అపాయదేవత వెంటనే పిరికిపందను కౌగలించుకొంటుంది. పైగా ''ధైర్యవంతునకు మరణం వక్కసారే! కాని పిరికిపందకు ప్రతిరోజు మరణమే'' నని నీతో ఎన్ని సార్లు శెలవిచ్చాను.

సుగుణ-తమరు శెలవిచ్చే ధైర్యసాహసాలు, దేశరక్షణమందో, మాన రక్షణమందో, ప్రాణరక్షణమందో, మరియిట్టి యితరకార్యములయందు ప్రదర్శింపవచ్చునేకాని, చీటికిమాటికీ, చిల్లరపను

లకు వుపయోగిస్తే 'పిచ్చుకమీాద వేసే బ్రహ్మాస్త్రం'లాగవుండదా?

జీవన:—నీతో వాదానికిగాని, విమర్శకుగాని, దిగితే దారితెన్ను లేని డొంక కీడుస్తావు. దీనికికారణం, నీతండ్రి కర్షకుడుకావడమే గాక, పల్లెటూరి పాతవైద్యుడవడంచేత తాను తయారుచేసిన పిరికిమందులు వుగ్గుపాలతోసహా మీాకు నూరిపోశాడు. అట్లా, మీాలో పాతుకపోయిన పిరికితత్వాన్ని పెళ్లగించాలంటే ముందు నేనురోషంచంపుకొని, ఋషినై జపమాలచేతపట్టాలి!

సుగుణ:—కష్టపడిఅరిషడ్వర్గాలజయించి శాంతమూర్తియైన ఋషిగా మారితే ఎంతసుఖమో! ఎంతపుణ్యమో! ఎంతకీర్తియో; కాయకష్టముచేసి, కష్టపడి కృషితో ధాన్యంపండించి, ఒక రిని బ్రతికించి, తానుబ్రతికితే అంతేకీర్తి, అంతేపుణ్యం. మా తండ్రి కర్షకుడైతే తప్పేమైంది? "సత్కవుల్ హాలికులైననేమి, గహనాంతరసీమల కందమూాల గోద్దాళికులైననేమి, నిజదార సుతోదరపోషణార్థమై" అనలేదాధన్యుడు పోతనామాత్యుడు. దాన్ని ననుసరించిన మాతండ్రి ధన్యుడే!

జీవన:—

సీ. నీలైనసూటులన్ ♦ నిప్పులలో మాడ్చి
 నేతబట్టలుగట్ట ♦ నేర్వమనెదొ
విస్కీల బ్రాందీల ♦ విడ్కోలుగావించి
 పొగచుట్ట కలవడి ♦ పొక్కమనెదొ
వేయివిధంబులౌ ♦ వేడ్కల నలరారు
 పట్టణవాసంబె ♦ గిట్టదనెదొ
గీ. కిల్లుచెప్పులు ములుకఱ్ఱ ♦ కేలదాల్చి
 బురదభూముల పడిదున్న ♦ బోవుమనెదొ
 యింక నేమేమి చేయింతు ♦ విందువదన
 పల్లెటూరుకు నను నీవు ♦ పారదోలి.

నీమొఖం! చాల్లే!! నీ వుపన్యాసం. నన్నూ ఒక నాగలికట్టి, ముల్లుకఱ్ఱచేతబట్టి, ఛో, ఛో, ఛో, హై, హై, హై, అనమం

టావు. ఈ పాడు పీడంతా యిష్టంలేకనే వున్నపొలమంతా ఒక రికి స్వాధీనతాకట్టుపెట్టి యెన్నడో వెడద వదిలించుకొన్నాను.

సుగుణ:—రామ! రామ!! నేనుమిమ్ములను దున్నమన్నానా; ఎంత మందినౌకర్లులేరు; తాము దగ్గఱవుండి కృషిచేయించినచో నెల కైదువందలువచ్చే వుద్యోగిజీతానికి మించిన ఆదాయం మన కుండేది. ఇంతఅప్పు ఎందుకు పెరుగుతుంది? స్వాధీనతాకట్టు అనేమిషతో ఎంతలాభంగడించాడో సోమయ్యపంతులు మీకు తెలియదా? పల్లెటూరు, పల్లెటూరు అని పల్చగా అంటారు. పల్లెలో లభించే పాలుమీగడలు, పరిశుద్ధమైన గాలి నీరు. ఆహారం, యిలాంటివెన్నో సౌకర్యాలు పట్టణాల్లో ఎక్కడివి? అసౌకర్యం, అనారోగ్యం తప్ప.

జీవన:—తూ. ఇక్కడినవనాగరికత, ఇక్కడిసినీమాలు, నాటకాలు, షాపులు, షోకులు, యిక్కడిమజా అక్కడ తపస్సుచేసినా లభి స్తుందా? మూడునెలలుదున్ని ఏడాదికిపండిస్తే పదిపుట్లుధాన్యం వచ్చేదేమో! చూడు ఒక్కకలుపుకలిపి ఒక్కరౌండువేస్తే అదృష్టంకుల్లిందంటే మూడాసుల ఘంకామీదవచ్చే ఆదాయం తో మూడేళ్ళు అనుభవించవచ్చు. ఇదిగో కళ్లువిప్పి బాగా చూడు. ఇవ్వాళ ఒక్కఘంటలో నేను పండించిన నోట్లకట్ట. (అని నోట్లకట్ట జేబునుండితీసి ఎగురవేయుచు సుగుణచేతికి యివ్వబోగా, పోలీసులు తటాలున యిరుప్రక్కలనుండి ప్రవే శింతురు.)

పో-ఉ:—(తనచేతనున్న పిస్టల్ చూపుచు) హోల్డప్ జీవనరావు (Hold-up) కదలితివా చచ్చెదవు.

(జీవనరావు చేతులుపైకెత్తి నిలబడిపోవును. (పోలీసుఉద్యోగి సంజ్ఞచొప్పున జవానులు జీవనరావును బంధించపోగా సుగుణ వారిని వారించి, జీవనరావు కడ్డముగా నిలచి)

సుగుణ:—ఆ! ఆగండి!! నిరపరాధిని బంధించడానికి మీకు అధికారం వుందా?

పో-ఉ:—అధికారుల అధికారముఉండబట్టే అపరాధిని అటకాయించ గలిగాము.

సుగుణ:—యేదీ అధికారానికి ఆధారం?

పో-ఉ:—ఇదిగో! (అని జేబులోనుండి వారంటుకాగితమును తీసి సుగుణచేతికిచ్చును. సుగుణ కాగితమును పరికించి నవ్వి)

సుగుణ:—ఇందులో మావారి పేరేదీ లేదే? చూడండి, (అని కాగితమును పోలీసుఉద్యోగి కన్నుల కడ్డముగానుంచి భర్తను పారిపొమ్మని సైగచేయగా, జీవనరావు పోలీసుఉద్యోగి చేతిలోనిపిస్తలు క్రిందపడునట్లుకొట్టి, ఒకజవానును క్రిందపడ ద్రోసి, పారిపోవును. ఇరువురు జవాన్లు వెన్నంటుదురు.)

పో-ఉ:—మోసకారీ! మమ్ములను, మోసంచేసి, నీమగనిని తప్పిస్తివా! యిందులో నీభర్త పేరులేదా? యింగ్లీషులో స్పష్టముగా వ్రాయబడివున్నదే చూడు ద్రోహీ!

సుగుణ:—అయ్యా! క్షమించండి. ఇంగ్లీషులోనని మీరు నాతో అనలేదే! ఆడమనిషిని, ఆంగ్లభాష తెలియకుండుటచే అట్లంటిని.

పో-ఉ:—చాలు! యింక కట్టిపెట్టు. (అని క్రిందబడి లేచిన జవానును నుద్దేశించి) ఎంతదూరం పోగలడు? చూస్తాను. నడూం, తెలివి తక్కువపెద్దమ్మ. పరిగెత్తు! వెంటబడిపట్టుకో! (అనుచు త్వరితముగా అందరు నిష్క్రమింతురు.)

సుగుణ:—(చేతులు జోడించి ధ్యానించుచు) హేదీనబంధూ! అనాథనాథ! భక్తవత్సలా! సావాసదోషంచేత, చెడుమార్గం అలవడ్డ నా నాథుని రక్షింప నీవుగాక మరెవరున్నారు? తండ్రీ! రక్షించు. కరుణ జూపవా! సమయమువచ్చింది! తండ్రీ!!

గీ. బ్రోచునట్టి కరమట నీది ♦ దాచుకొనకు,
సుంత నానంక జూపించు ♦ వంత దీర
పొంగి పొరలుచు హృద్గంగ ♦ నింగి వఱకు,
కడిగివైచును నీపాద ♦ కమల యుగము.

(పాట పాడుచుండగా యవనిక జారును.)

# చతుర్థరంగము

(స్థలము: మంజువాణియను వేశ్య గృహము.) (ప్రవేశము మంజువాణి తమ్ముడు రాముడు. మంజువాణి అలంకరించుకొనుచు పాటపాడుచు ఉండును.

మంజు:—ఒరే రాముడు! ఎంతసేపైంది వెళ్ళి, ఎక్కడేడ్చావు! ఒక్క క్షణంలో చేసుకొచ్చేపనికి, ఒక్కపూటచేస్తావు! నీకెప్పుడూ యిదేరోగం.

రాము:—బావల జేబులు భద్రిగావుండి, నీవు చల్లగావుంటే, నేను సున్నగావుంటా! నా కంటు కేరోగం, భోగం అను, యింకా బాగుంటుంది. ఆలస్యంఅంటే ఆలస్యంగానేమరి, ఏపెద్దమనిషి ఎవరైనా ఏదో ప్రసంగం మొదలుపెట్టి నిన్నుగూర్చిన వర్ణనలు నన్నుగూర్చి స్తోత్రాలు మొదలైనవాటితో విజృంభించి, అటు నలిపి, యిటునలిపి చెప్పలేక, చెప్పిచెప్పక ఒప్పించు మీఅక్కను అని గ్రంథం ముగిస్తారు. ఇట్లా ముగించిన నీకృతి కావ్యాలను మూటగట్టి మోసుకొచ్చి నీముందుపెడ్తే మునిగేవి కొన్ని తేలేవికొన్ని జమచేయటంనాకష్టం. ఒప్పుకోటంనీయిష్టం యిదంతా నీపనా నాపనా, యిలాంటి ఆలస్యాలకి కారణం నీవేకాని నేను కాదు.

మంజు:—సరేలే, చాలుగాని, యిప్పటిమాట మూటగట్టి, ముంచావా? తేల్చావా? ఏమైంది!!

రాముడు:—నీమాటప్రకారం కంట్రాక్టరు గోపాలంగారింటికి వెళ్లాను. పిల్చాను; ఆయనభార్య చక్కావచ్చి, వారింట్లోభోంచేస్తున్నారు వుండమంటూ, మీరెవరని అడిగింది. మారుపేరు చెబుదామా, ఆయన తొందరగా రాడేమో! అసలుపేరు చెబుదామా, ఆమెకు ఆగ్రహంవస్తుందేమో! అని ఆలోచించి టెలిగ్రామ్మాష్టరు రామయ్యగారన్నాను. పాపం వెంటనే లోపలికెళ్ళి చెప్పిందోలేదో! గుళ్లో దద్ధోజనం వినియోగంచేసే అయ్యగారిలాగా, అట్టే ఎంగిలిచేత్తో ప్రత్యక్షమై, యిదే చెయ్యి కడుకొనివస్తున్నాను; పద, అన్నాడు. అట్లా గాదండీ, నన్నే

అడిగి తెమ్మన్నది అన్నాను. ఇంతలో ఆయన భార్య బుట్ట
బొమ్మలాగ చక్కా వచ్చింది. అప్పుడు ఆయన భార్యముందు
యేసమాధానం చెప్పలేక, వెఱ్ఱిమొగం వేసి, గ్రుడ్లు త్రిప్పి,
గుటకలు మ్రింగి, పూర్తియైనట్లే నేనే స్వయంగా వచ్చి సమర్పి
స్తానని మనవిచేయి ఘోరవారితో అన్నాడు. ఏం చేయించ
మన్నావు! గాజులా, గొలుసా?

మంజు:—కాదు, మంచి ముత్యాలహారము. (బయట తలుపుచప్పుడు
అగును- మంజువాణి దిగ్గున లేచి ముందునడచి ప్రకాశముగా)
అదిగో! మాటలోనే వచ్చినట్లుంది. వట్టిచేతుల్తో వచ్చాడా,
అట్టే నాల్గు వడ్డించి తిరోన్ముఖం చేయిస్తా! రాముడూ!! తలుపు
తీయరా! (రాముడు లోనికరిగి గోపాలంగారితో ప్రవేశించి)

రాము:-బావా! మీకు నిజంగా నిండా నూరేళ్ళాయువుంది. మా అక్క
మిమ్మల్నే యిప్పుడు కలవరిస్తూంది, ఇంతలో మీరే దయచేశారు,
కూర్చోండి! (అని కుర్చీవేసి) రత్నహారాలు పంపిన రాజాధి
రాజులను నిరాకరించి, మోజుకు ముత్యాలహారం, అన్నా
యిప్పించని మీతో ముద్దు ముచ్చట్లు జరుపుతుంది. మీదగ్గర
ఏమందో మంత్రమో వుండాలి. లేకపోతే మహేంద్రుడంతటి
వాడొచ్చినా మా అక్క మాట్లాడేదా! అబ్బ నేనెరుగని
దేముంది.

మంజు:—ఒరే! చాలు, యిక కట్టిపెట్టు. నిన్ను నిజం చెప్పవద్దని,
ఎన్నోసార్లు చీవాట్లుపెట్టాను. నీవు యిట్లావున్నవి వున్నట్లు
దాచక చెప్పావంటే, పొగడేస్తున్నారేమోనని, అనుమానం
కలుగుతుంది. నిజంగా నాకు దేనిమీద ఆశ లేదు. వారి
సందర్శనభాగ్యం నెలకొక్కసారైతే అదే మహదానందం.
(గోపాలంగారిని సంబోధించి) మావాడు మీయింటికొచ్చి
ఏమన్నాడో, క్షమించండి. వీడధికప్రసంగి. మీతోడు ఒక్క
సారి దర్శనమిచ్చి వెళ్లమని, తమతో మనవి చేయమన్నాను.
(రాముడ్ని సంబోధించి) ఒరే! నీవు ముందువెళ్ళి రెండుకప్పులు
కాఫీ త్వరగా తేరా! (రాముడు నిష్క్రమించును.)

గోపా:—(నవ్వుచు) ఆ! నేనంతే అనుకున్నాను. తెమ్మన్నది అన్నాడు. అంటే, నీమనస్సు నేనెఱుగందా! ఇదంత వీడి కవిత్వమే అనుకున్నాను. అబ్బే! నీనోటినుండి ముత్యాలహారం అని విన్ననాడే, సూరతి ముత్యాలుకొన్నాను. ఆ సాయంత్రం బంగారుతీగలోచుట్టించి దగ్గర పెట్టుకొన్నాను. పదివేలుదండుగొచ్చి కట్టిబిడ్డికూలిపోసిగాక, నీకోర్కె తీర్చలేకపోతే నేను బ్రతికెందుకు. యిదుగో హారం, బాగాపరీక్షచేయించికొన్నాను కొలత సరిపోయిందో లేదో! చూడు.

మంజు:—(నవ్వి) అబ్బో! ఎంతటి అమాయకులు. మీరు నిరంతరం కౌగలించేకంఠం కొలత మీకు తెలియదా? (హారమును తిలకించి ఆనందించుచు) ఈరోజు దశమీ మంగళవారం మంచిదే. దశమీఏకాదశులు ధనముకూడుఅన్నారు. (హారముమెడలో వేసుకొని) ఏదీ కాళ్ళు సరిగాపెట్టండి.

(అని ఎడముగానున్న గోపాలంకాళ్ళను సరిగావుంచి,

ఆతని పాదములకునమస్కరించును.)

గోపా:—దీర్ఘాయురస్తు! నూరేండ్లు రోగంనొప్పిలేకుండా బ్రతికి నాకానందం కలిగించు. మనోహరి! మంజువాణీ? (అని దగ్గఱ చేరి) నీకు నిజంగా, నాయందుండే ప్రేమ ఎవరికర్థమౌతుంది?

సీ. వేశ్యకు వలపు ఛీ ♦ వీసంబు లేదను
వెఱ్ఱికూతలు దిద్ద ♦ వెలసి తీవు
పతిభక్తిగల దివ్య ♦ పడతి నేర్వగలేని
పద్ధతు లెఱిగిన ♦ పతిత వీవు
పలుజాతివారల ♦ పతులుగా నొల్లని
సాధ్వియౌ సాని ♦ సంసారి వీవు
నన్ను దైవంబుగా ♦ నన్ని వేళల గొల్చు
సఖియరో! నా దార ♦ సాని వీవు
గీ. భరత శాస్త్రోక్త, నాట్యాది ♦ భంగి తెలసి
జంత్ర గాత్రాది బంధనా ♦ జాల మెఱుగు

సత్య, వినయ, సుందర, మహా ♦ సరసమతివి:
నిన్ను కవగూడు నాపూర్వ ♦ పుణ్యమెంతొ.

మంజు:—మహాభాగా! సతుల మనోభీష్టము నెరవేర్చు మీబోటి పతియేగదా నాయట్టి సతికి సద్గతి. నేనెంతయు ధన్యాత్ముకాలను!

సీ. సాని నుంచితి నంచు ♦ సాగె సారెకు రాక
సమయమెఱిగి వచ్చు ♦ సాధు చరిత
రూకల యూకగా ♦ రూఢిమై యొసగెడు
దాతవు నీవు నా ♦ ధవుడ వగుట
నిశ్చల యనురాగ ♦ నియమంబు లెరిగిన
మోహనాంగుడవు నీ ♦ ముద్దు కొనుట
పూర్వపుణ్యముచేత ♦ బురుషు డబ్బుజగాన
దాన ఫలముచేత ♦ తనయుల నెసి

గీ. ధర్మ శాస్త్రార్థ మెపుడేని ♦ దప్పగలద
నేడు గననయ్యె నీయెడ ♦ నిజము వినుము
నాకు నీకన్న భువిలేదు ♦ నన్యమెద్ది
నొక్క ఆలింగనం బిమ్ము ♦ నొర్వ నుమ్ము.

(అని మంజువాణి గోపాలంగారిని కౌగలించుకొనును.)

గోపా:—మనోహరీ! మంజువాణి! నామీద నీకు యిలాంటి నిశ్చలమైన భక్తిప్రేమలువుండడంచేతనే, నీవుగీచినగీటుదాటకుండా, నీవడిగింది లేదనకుండా, నీయందుండేప్రేమ వెల్లడిచేస్తున్నాను. ఇదిగో! చూడు! ఈకంట్రాక్టరు గోపాలంగారి కంఠంలో జీవుమున్నంతవఱకు నీయింట్లో చీపురుపుల్లకుకూడా. కొఱత, అనేది వుండబోదని యిదే నా బ్యాంకుచెక్కు సాక్షిగా ప్రమాణం చేసి చెప్తున్నాను నమ్ము.

(అని తనజేబులోనుండు బ్యాంకుచెక్కుతీసి తలపైపెట్టుకొనును.)

మంజు:—ఆ! ఆ! అయ్యయ్యో! అంత ఘోరప్రమాణం మీరెందుకు చెయ్యాలి! మీకేంఖర్మం నాకేమిలోటుచేశారు. నన్ను చంపుకుతిన్నట్టు వద్దు! వద్దు!

రాము:—(వేడి కాఫీకప్పులుచేతులందుంచుకొని ఊదుకొనుచూ ప్రవేశించి) అబ్బబ్బా, తేతెమ్మంటం, కొంచెంఆలస్యమైతే వద్దు వద్దంటం ఎవరు చెప్పారే, నీకీచదువు. అమ్మబ్రతికివుండగా చుట్టపికదొరికినా, తెమ్మన్నమాటేగాని, వద్దన్నమాట, దానిజన్మలో అని యెఱుగదు.

మంజు:—ఛీ! ఛీ! అసంగతికాదురా, వారేదో వారిబ్యాంకుచెక్కుతోడుగా, అన్నమాట తప్పనని అంటూంటే, అల్లా వద్దన్నాను. అంతేకాని, తెచ్చినకాఫీ వద్దనికాదు.

రాము:—నేను ఏదోహోటలులో రెండుకప్పులుతాగేసి, మీకోసం రెండుకప్పులుతెస్తున్నా! ముందుగానే వద్దంటే, యిదికూడా, అక్కడేతాగివచ్చేవాడ్నిగా, యింతదూరంఎందుకూ అని!

గోపా:—(నవ్వి) ఓరీ! నీకడుపులో హనుమంతుడుదూర! రెండు కప్పు లక్కడ తాగి మళ్లీరెండుకప్పు లిక్కడ త్రాగుదామనుకున్నావూ? నీది కడుపా చెరువా?

(మంజువాణి గోపాలంవెనుక నిలబడి జేబులోనున్న బ్యాంకిచెక్కు కోరమని రామునకు సైగచేయును.)

రాము:—చెరువు యీరోజుల్లో వక్కమంచివర్షానికే నిండిపోతుంది, కాని వున్నది ఒక్కజానెడు పొట్ట! ఏన్నోవేలకొలది పళ్లచక్రాలుగల, ఫాక్టరీలోనలిగితయారైన పుట్లకొలది బియ్యాన్ని యీ ముప్పైరెండుపండ్లసందున పెట్టి రసాయనంచేసి కడుపులోకి దింపినా కాటికెళ్లిందాకా, కడుపునిండి కంఠం దాటంలేదు. (మంజువాణీ గోపాలం నవ్వు)

గోపా:—ఓరే, నీకవిత్వం కాలిపోను.

రాము:—కాలవద్దు మాడవద్దు మీరు బ్రతికివుండగా మాకేంకొఱత బావా! ఏది ఆకాయితం.

మంజు:—నీమొఖం, కాయితంఏంటి కాయితంగాదు. బ్యాంకి చెక్కు.

రాము:—నోటూ కాయితమే చెక్కు కాయితమే, కార్డు కాయితమే వార్తాపత్రికా కాయితమే చీట్లపేక కాగితమే గాలిపటం కాగితమే దస్తావేజన్నా కాగితమే కలియుగంలంటే కాయితమయం కాదా? ఏది బావా! నాకొద్దులే! నీ బ్యాంకు చెక్కు.

మంజు:—ఒరేయి ఒకవేళ యిస్తేగిస్తే వారికి దయయుంటే నాకుగాని నీకెందు కిస్తారురా!

గోపా:—పిచ్చిదానా! గాదెక్రిందకొక్కు గాదెక్రింద బ్రతక్కపోతే ఎక్కడ చస్తూంది. మంజూ! యిటువిను అమ్మతోను, ఈ చెక్కులో నీ వడక్కముందే నీకూ వాడికీ మార్చి యిద్దామనుకున్నా! యిది 250 రూపాయల చెక్కు.

రాము:—ఏది బావా! యిప్పుడు చూపునీదగ్గరా ఇంద్రుడంటే నీకే చెల్లు రంభంటే మాఅక్కకే చెల్లు మీయిద్దరికీజోడీ నాకు నేతిపకోడీ (జేబునుండి పకోడితీసి తినును,) ఎల్లుండి మాఅమ్మతద్దినం కూడావుంది. మీదయ.

మంజు:—అన్నట్లు మర్చిపోయాను. సమయానికి జ్ఞప్తిచేసావు. చేతిలోకూడ యిబ్బందిగాయుంది ఎంతకష్టపడీ పెంచింది ముండ దాన్నితల్చుకుంటే గుండెబ్రద్దలైపోతుంది. (అని కంట నీరు తుడుచుకొనును.)

గోపా:—మంజూ! నేను బ్రతికుండగా నీ వేడిస్తే నేను బ్రతికానా, చచ్చానా, అని నా కేసం దేహంకలుగుతుంది. ప్రారుణో నీకేం తక్కువ? అన్నిటికినేనున్నా. (రామునిసంబోధించి) దగ్గా చెయ్యికాక దాగుతుందామరీ, (చెక్కునుబయటకుతీసి) ఇదిగో యిప్పుడే సంతకం పెట్టేస్తున్నాను. (అని సంతకంపెట్టును.) యివ్వాళే మార్చి పదిరూపాయలు నీవుతీసికొని తక్కినవి మీ అక్కకు యిచ్చెయ్యి జాగ్రత్త.

రాము:—బూరెమాఅక్కకు బుడిపెనాకా! న్యాయమే, పోనీ తే రొట్టెలవానికన్నా, ముక్కలవానికేలాభం కాదూ మరి.

గోపా:—అవునోయ్! నీకు ముక్కలు సంపాయించి, మూటకట్టు దామని ఆశవున్నా రొట్టెలుసాధించి పొట్టనింపుదామని మీ అక్కకి మాత్రం లేదులే! లేదేమిటి? అదే నాగట్టినమ్మకము.

మంజు:—దానకర్ణునిలాంటిదాత మీరు నాకుండ నాకేం లోటు! మంజువాణీగుమ్మము మళ్లొక్కడు త్రొక్కగలడా?

రాము:—త్రొక్కితే నెత్తురుగ్రక్కడే, పూరకే పోనిస్తానా! యీ రాముడు మలపరాముడుగాడు, పరశురాముడేనని తెలియం దెవరికి?

మంజు:—అబ్బా! గుర్రెమొహం ఏంటోగాని తాము పదిరోజులకొక్క సారివచ్చినా, మీదర్శనం అయ్యేవరకు ప్రాణాలు కొట్టుక లాడ్తాయి, చూచుకున్న వేళావిశేషం ఏలాంటిదోకాని.

గోపా:—అటువంటిప్రేమ, గౌరవం నీకు నాయందుఉండడంచేతనే, నీవు కబురంపిన మాత్రాన అన్నంవదలి కాకిలాగ ఎగిరి వచ్చాను.

మంజు:—అయ్యో! అయితేకాఫీఅయినా తాగండిత్వరగా చల్లారి పోతుంది.

(తెరలో తలుపుతట్టినచప్పుడు మంజువాణీ గోపాలం త్రాగబోవు కాఫీకప్పులను బల్లక్రిందయుంచి లోనికి చూతురు.)

గోపా:—అదిగో! బయటఎవరో తలుపుకొడుతున్నారు.

మంజు:—రామా! ఎవరోత్వరగావెళ్ళిచూడరా? (రాముడు లోనికేగి మరల వెంటనే ప్రవేశించి)

రాము:—అక్కా! అక్కా! పోలీసోండ్లౌ! కొంపమునిగింది ఎందుకో గాని తలుపులుతోసుకొని వస్తూన్నారు. యిదేంపాపం బావా! మీరన్నాపోయి కొంచెం దబాయించిచూడండి

గోపా:—(ఒక్కనిట్టూర్పువిడచి) ఏం దబాయించనురా బాబూ! వాళ్లకునాకు అసలేపడిరాదే! (అని గాభరాపడి అటు యిటు తిరుగుచూ) మంజువాణీ యిప్పుడు నన్నేమిచేస్తావో నీదే భారం పరువుపోతుంది రక్షించు! రక్షించు!

మంజు:—భయంలేదు. ఆగండి (అని అచటగల రేడియోసెట్టు అమర్చబడిన పెద్దపెట్టెను ముందునకువంచి దానిలోపలవైపున దాగివుండమని సైగచేయుచూ) ఊ! ఊ! త్వరగా! దాక్కోండి

(అనుచూ అతనిని అందులోదాచి రేడియోపెట్టె సరిగానుంచుచుండగా పోలీసు వుద్యోగి జవానులతో, ప్రవేశించును)

రాము:—(కుర్చీలు సవరించుచూ) బాబూ దయచేయండి.

మంజు—నాయుడుగారికి నమస్కారాలు దయచేయండి.

పో॥ఉ:—నీ కారాలు మిరాలు తర్వాత చూడొచ్చునుగాని ముఖ్యంగామూడుముక్కలు నీతోముచ్చటించాలి. మాఆజ్ఞకు అణుమాత్రంవ్యతిరేకంగా నీవుగాని నీతమ్ముడుగాని సంచరించరాదు విను. (అని సందేహించుచు) యిక్కడ ఇతరులెవ్వరు లేరుకద.

రాము:—సెలవీయండి! బాబు సెలవీయండి! యిప్పుడు మీకు తెలియకుండా యిక్కడికి ఎవరొచ్చారు.

పో॥ఉ;—జీవనరావు ప్రస్తుతం మీయింటికొస్తున్నాడా! లేదా?

(మంజువాణి, రాముడు మాటాడక ముఖములు చూచుకొందురు)

పో॥ఉ:—ఏ! గొంతులోయేం అడ్డంపడ్డది జవాబు లేదు?

మంజు:—చిత్రం ... ...

పో॥ఉ:—చిత్రం గిత్రం కాదు. సరియైన సమాధానం చెప్పకపోతే. ఒళ్ళుయిల్లు గుల్లవుతుంది తెలిసిందా? మేము చెప్పినట్లు మీరునడిస్తేనే మీమర్యాద, మామర్యాదకూడ దక్కుతుంది లేకపోతే తెలుసుగా.

రాము:—తమమాటకు అడ్డేముంటుంది, మీరు బయటపెట్టడమే ఆలస్యం, మీతోఅబద్ధంచెప్పి బ్రతకగలమా! అమ్మో! ఎగిరే పిట్టయీకలు లెక్కపెట్టరే?

పో॥ఉ:—ఆ! అట్లా రా దారికి వాడికొఱకు, యిప్పటికి మూడురోజుల నుంచి అన్నాహారాలు లేకుండా తిరుగుతున్నాం.

మంజు:—అయ్యయ్యో! పాపం! అయితే ప్రస్తుతం దయచేసి ఈకాఫీ

అయినా త్రాగండి. (ఒక కప్పుమాత్రం పోలీసు ఉద్యోగికి అందివ్వ రెండవకప్పు రాముడు జవాను కందించుచు) తాగండి బాబూ! గింజ గింజమీదా మింగే వాడిపేరు రాసి పెడ్తాడు బ్రహ్మదేముడు.

పో॥ ఉ॥— అయితే ఈ రెండు కప్పులు ఎవరికోసం తెప్పిచ్చావు?

మంజు:— అబ్బే! మేమిద్దరం తాగుదామని - ఇంతలో పెద్దలు తాము దయచేశారు. అతిథుల్ని వదలి ఆరగించడం తప్పు గాదా! పుచ్చుకోండి, యిప్పుడే ఫలహారంకూడా తెప్పిస్తూ న్నాను. ఒరే, రాముడూ! హోటలునుండి ఫలహారంకూడా పట్టుకురారా! (అని రూపాయినిచ్చును. రాముడు నిష్క్రమించ నుండ)

పో॥ ఉ:— మేమిక్కడ ఉన్నట్లు, ఎవ్వరికీ తెలియకూడదు. తెలిసిందా? జాగ్రత్త!

రాము:— బావా! (అని లెంపలు వేసుకొని) క్షమించండిబాబూ, మా యింటికొచ్చేవాళ్లందరిని బావా అనిపిల్చేఅలవాటైనప్రాణము. మన్నించండి.

పో॥ ఉ:—(నవ్వి) త్వరగా, రా, వెళ్లరా, వాడు ఈరోజు తప్పక వస్తాడు. మా ప్రయత్నానికి ఏమి అభ్యంతరం ఉండగూడదు!
(రాముడు చిత్తం చిత్తం అని నిష్క్రమించును.)

పో॥ ఉ:—(జవానులను సంబోధించి) మనకు ఈ రోజువచ్చిన ప్రయివేటు యిన్ఫర్మేషన్ (Private information) వల్ల అతను యిక్కడికి తప్పక రాగలడని తోస్తుంది. కాబట్టి మీరు యీ యింట్లోనే, జాగ్రత్తగా వీలును బట్టి దాగి, సిద్ధంగా ఉండండి.
(వారినిదా మాటకు ప్రయత్నించుచూ, ఫర్నీచరుసర్దుచుండగా తెరలో సన్నగా ఈలపాట వినుపించును. పోలీసు ఉద్యోగి వెనుకకు తిరిగిచూచును.)

మంజు:— బాబూ! బాబూ!! అదిగో అదిగో!!

పో॥ ఉ:— నూ! (ముక్కున వేలుంచుకొనును, జవానులు దాగు కొందురు, పోలీసు ఉద్యోగి మంజువాణి చెవిలో రహస్యంగా

యేదో చెప్పి తానుగూడా అనువగు స్థలమున దాగుకొనుచూ మెల్లగా) జాగ్రత్త! జాగ్రత్త!!

మంజు:— మంచిది! మంచిది!! (జీవన చేత పిస్టలుతో ప్రవేసించును)

జీవన :—(ఈలపాట ముగించి)

చం॥ సరసుడనౌట నన్నుగని ♦ సాసులు సారెకు బిల్వనంపగా
విరసు లనూయచేత మరి ♦ వేడ్క వహింపరు భృంగరాజ మే
నరగునజేరి పుష్పమధు ♦ సారమరంద సుగంధసంగ్రహ
స్ఫురణవహింప ఛేకముల ♦ నూయనుజెందవె మంజువాణిరో!

డియర్ డార్లింగ్ (Dear darling) నా రాణీ! మంజువాణీ! ముస్తాబై నాకోసం ఎదురుచూస్తూంటావనే అనుకొన్నాను. యస్ (Yes) అనుకున్నంతే జరిగింది. వెరివెల్ (Very well) గుస గుస మాటలు వినిపించాయి. గూట్లో కొత్త పిట్టే చేరా వాలిందా?

మంజు:—నరసింహంలాంటి మీరు నివసించే యీగుహాలోనికి యేజీవి రాగలదు? వచ్చిందంటే చచ్చిందన్నమాటే! రేడియో పెట్టి శ్రీ కృష్ణుని వేణుగానంలాగ మీ ఈలపాట వినిపించగానే రేడియో ఆపేశాను.

జీవన: —అబ్బబ్బా! పోలీసువారి దృష్టి మామీద, మా దృష్టి పోలీసువారిమీద వుండడం సహజం గాబట్టి, రేచులాగ, నా వెంటబడ్డ కానిస్టేబిలు కంట్లో దుమ్ముకొట్టి, కనురెప్ప పాటులో బయట పడబట్టికానీ, లేకపోతే ఘుడియలో కరకంక ణాలు ధరించి కచ్చేరీలపాలు గావలసివచ్చేది. నిన్నటి నుండి నీళ్లు తాగడానికైనా తీరిక లేదు. ఆకలేస్తుంది. రాముడేడీ? వాడి చేత టిఫిన్ నన్నా తెప్పిద్దాం. (అంటూ చేతిలోని పిస్టలును యెగురవైచుచు పట్టుకొనుచూ, అటు యిటు తిరుగుచుండును)

మంజు:—చేతిలో ఆయుధం ఒకచెంప పెట్టి కొంచెం విశ్రాంతితీసు కోండి. వాడుకూడా ఫలహారం పట్టుకొస్తాననే డబ్బుపట్టు కెళ్ళాడు. బావగారియందు వాడికెంతో భక్తి!

జీవన:—అబ్బా! ఫలహారానికే వెళ్ళాడా! వెరీగుడ్ (Very good) మళ్లీ వెంటనే వేంచెయ్యాలి. పోలీసోళ్ల పోటు నాకెక్కువయింది (అని కుర్చీలో కూర్చుండును.)

రాము:—(ప్రవేశించి) బూందికూడా తెచ్చాను (జీవనరావునుచూచి అదరిపడి) దండం! బావా! నీకేదిష్టమో నాకు తెలియదా! నీకు పనికిరానంది నాకు. చూడు - బూందిగింది, లడ్డూగిడ్డూ, పకోడిగికోడి, పూరిగీరి, బజ్జీగజ్జీ, కూడా తెచ్చాను. (గీరుకొనును)

జీవన:—వెరీగుడ్ (Very good) సాలీసాబ్! సర్వజగం ఒక యెత్తు, సానితమ్ముడు ఒకయెత్తు అన్నారు బుద్ధిమంతులు. అవన్నీ యిక్కడ బెట్టు!

(రాముడు పొట్లాలువిప్పి ముందుంచగా జీవనరావు ఒక్కొక్క పొట్లమునందుగల పదార్థములను తినుచూ)

ఒరేరామా! బూందినాకు, గిందినీకు. లడ్డూనాకు, గిడ్డూ నీకు. పకోడినాకు, గికోడినీకు. పూరీనాకు, గీరీనీకు. బజ్జీనాకు, గజ్జీనీకు. యివిగో పుచ్చుకో.

(పొట్లాలకాగితాలు వానిపై విసరి వికటముగా నవ్వుచూ,)

త్వరగాలోపలికివెళ్ళి నీళ్ళుతేరా! మంజులా! కమాన్ (Come on) నీవుకూడా షేర్ పుచ్చుకో (రాముని నుద్దేశించి) వెళ్ళరా నీళ్ళకు!

రాము:—ఏగింజ యేనోట్లోపడాలో ఏర్పాటుచేసివుంచాడా భగవంతుడు. అదృష్టవంతుడవు బావా! యింకా వొక్కక్షణం ఆలస్యంగా వచ్చివుంటే అవన్నీ నేనే తినేవాడ్ని.

జీవన:—ఒరేయ్! త్వరగా నీళ్ళు తేకపోతివా! యిప్పుడే తింటావు నాచేత్లో, నడూ! (మంజువాణి నవ్వు - రాముడు నిష్క్రమించును.)

జీవన:—జరిగినన్నాళ్ళు వెయ్యరా మొఖంమీద కాగడా; అన్నాడు అనుభవజ్ఞుడు. కాని వాడొచ్చిందాకా డియర్ (Dear) మఱొకమారు మ్రదాసుప్రోగ్రామ్, పెట్టిరా! ఆలకిస్తూ ఆరగిద్దాం!

(జీవనరావు యెడమచేతిలో పిష్టల్ పట్టుకొని కుడిచేతితో ఫలహారము తిను చుండును. మంజువాణి అనుమానించుచు రేడియోపెట్టెవద్దకు వెళ్ళి గోపాలంగారిని పాడమని సంజ్ఞచేసి రేడియోమటను త్రిప్పగా రేడియోలోకూర్చున్న గోపాలంపాట మొదలుపెట్టగానే, మంజువాణి జీవనరావు వద్దకువచ్చి కూర్చొని ఫలహారంచేయు చుండును.)

(రేడియోలో కూర్చున్న గోపాలం ఇట్లు పాడును.)

పాట - రాగం. ఫరజ్ - త్రిశగతి.

వస్తావు పోతావు నాకొరకు, వచ్చికూర్చున్నారు నీకొరకూ
సగమూచచ్చినాను నీకొరకు, వచ్చిన చచ్చేవు నాకొరకూ
ఆలీమాటనురోసి అన్నంబట్టుత్రోసి, అదరిపడివస్తి నేనిటకు
భామప్రాణంబు దక్కించురానిటకు, అయ్యోప్రాణంబు
దక్కించురానిటకు

(రేడియో పాడుచుండగా పోలీసువుద్యోగి చాటునుండి, జీవనరావు చేతిలోని పిష్టలు లాగివేయుమని మంజువాణికి సైగచేయును.)

జీవన:—వాట్ నాన్ సెన్సు (What nonsense) భజనప్రోగ్రాం లాగున్నది. మనకు హుషారుపుట్టి ఒక్కటుమిా వదిలామంటే వెయ్యిరెట్లు బాగుంటుంది.

(అంటూ జేబునుండి సారాయిబుడ్డి తీసి తాగుచూ)

పాట: రాగం - బేహాగ్, తాళం - దాద్రా

సారాయికీ జోడా సానియున్న స్వర్గమేలా।
సర్వలోకంబులలో, సౌఖ్యసాధనం బిదియే
వర్ణింప తరమానా వాహావ్వారే దీని మజా॥ సారా॥
జర9ంత తాగిచూడు జగమెల్ల గనుపించు
పూర్తిగ సీసాతాగు పుష్పబాణుడవు నీవే ॥సారా॥
భయరోగముల బాపు బ్రాందీకి సరియేది
పర్వతంబులనైన బెదరింతువు తాగినా ॥సారా॥

మాపాటకు వ్యతిరేకంగా శ్రీరంగనీతులు చాలామంది వాసి9స్తారు అనుభవించటం చేతగాక! అయితే

గీ॥ పండువెన్నెల పొగడని ♦ పండితుండు
ఇక్షురస మొల్లనని పల్కు ♦ నిష్టపరుడు
చూతఫలముల రోతగా ♦ చూచువాడు
సాని సారాయినొల్లని ♦ చచ్చుగాడె.

అంతేనా, డియర్ మంజూ, లే మద్రాస్ ప్రోగ్రాంమార్చి తిరుమనాపల్లి ప్రోగ్రాం పెట్టు చూద్దాం!

[మంజువాణి లేచి మరల రేడియోదగ్గరకు వెళ్ళి ప్రోగ్రాంమార్చినట్లు రేడియోను సవరించుచు మరల గోపాలమును పాడుమని బ్రతిమాలి వచ్చును. మరల రేడియోపాట గోపాలం పాడును]

త్యాగరాజకృతి: రాగం - చక్రవాకం, త్రిపుట ఖండగతి
ఎటుల బ్రోతువో తెలియా । యేకాంత రామయ్యా
కటకట నాచరితము కర్ణ కఠోరమయ్యా॥ యెటు॥
పట్టీగొడ్డారితిబక్షించి తిరిగితీ । పుట్టూలో భూలానూ
పొట్టాకై పోగాడితీ దుష్టూలంతో గూడీ। దుష్కృత్యములూ సలిపి
రట్టూజేసిన త్యాగరాజును దయగొని ॥ యెటు॥

జీవ: — యూస్ లెస్ (Useless) తత్వవేత్తలకు త్యాగరాజకృతి మనకెందుకు చూడు, మంజూ! మనం అనుభవంలో వుండే రాగంతో ఒక పద్యం నీమీద చదువుతాం. మా గాత్రానికి నీమనసుతో బాటు మంచుగడ్డలు కరిగి నీరై పోవాలి, విను డియర్ !

సీ॥ ఉంచుకొన్నవారి ♦ సంచులు కరగించి
లంచముల్ మాకిచ్చు ♦ రమణివీవు
పయి పయి మాటల ♦ పరులను మెప్పించి
అధరంబు మాకిచ్చు ♦ అతివ వీవు
మొంచ మించినవారి ♦ మంచాల చాటుంచి
మాచేతి చిలుకవై ♦ మసలెదీవు
త్రాగియు తన్నుచు ♦ తప్పుమాటలనాడ
మనసున నుంచని ♦ మానవతివి

గీ॥ వెలగపం డ్లట్లు విటులను ♦ గుల్లజేయు
మదగజంబును బోలిన ♦ మంజువాణి
జీవనుని చేతి యంకుశంబున ♦ జిక్కె నెల్ల
యెన్ని జన్మాల ఋణమో కో ♦ యెన్నతరమె.

(రాముడు ప్రవేశించి గ్లాసుతో నీరు తెచ్చి జీవనరావుకందివ్వగా, ఆతడు నీరు త్రాగుసమయమున రేడియో మెకానిక్ షన్ముగం, రేడియోపెట్టెనం దమర్చబడు వాల్వ్సు, స్పీకరు మొదలగు పరికరములతో ప్రవేశించి)

షన్ము :—ఏముండీ? నిండా నమస్కారాలు.

జీవ :—(ప్రక్కకు తిరిగిచూచి) ఓహో షన్ముగం పిళ్ళె, యేమది తెచ్చావు?

షన్ము:— మంజువాణి అమ్మాళ్ రేడియోస్పీకరు చెడిపోయిడిసినాది ఇదా! రిపేరీ చేసి తెచ్చి పెట్టి ఉండాను. నిన్న కాత్తాల అమ్మ స్ఫుబమణ్యాం గుప్తగారు; దానె యిదినాకు యీడ యిచ్చి ఉండారు. యీ దినం రిపేరీ చేసి తెచ్చి ఉండాను, ఇదా సమాచారం;

జీవన :—ఓహో అదా? సమాచారం! అయితే కథ అడ్డంగా తిరిగించన్నమాట! స్పీకరు లేకుండానే, ఈ రేడియో విపరీత గానం చేస్తుందంటే ఇందులో ఏభూతమో పిశాచమో దూరిం దన్న మాట! యిదే యిప్పుడు నా పిస్టల్ దెబ్బ మంత్రంతో పిశాచాన్ని పీనుగ జేస్తాను....

షన్ము:— అడడా, యిదెన్నపావం, యిదెన్నపావం, అడడా ......

జీవనరావు పిస్టలు ధరించి రేడియో పెట్టెవద్దకు వెళ్ళి పెట్టెను తెరచి అందు దాగియుండి పాటలు పాడిన గోపాలాన్ని మెడబట్టిబయటకు యీడ్చుచుండ)

గోపా:— హా! హా!! హాతోస్మి, హాతోస్మి, చచ్చాను, పిశాచాన్ని కాదండి బాబూ! కంట్రాక్టరు పిచ్చిగోపాలాన్ని! కాళ్ళు మొక్కుతా కనికరించుబాబూ! బుద్ధి గడ్డితిన్నది. ఇక జన్మలో యిక్కడికిరాను. ...

(అనుచూ చేతులుజోడించి బయటకురాగా మంజువాణి పోలీసులకు సంజ్ఞ చేయును. పోలీసులు జీవనరావు వెనుకప్రక్కనుండి పైబడి, పట్టుకొన, జీవనరావు

ఇరువురుపోలీసులను క్రిందపడగొట్టి పోలీసుఉద్యోగిని పిస్టల్‌తో కాల్చుటకు ప్రయత్నించ, పోలీసుఉద్యోగి జీవనరావు మనికట్టుపట్టుకొని పిస్టల్ లాగుకొనుటకై వెనుకులాడు చుండ పిస్టలుగురి గోపాలం, పద్మాగం, రాముడు మొదలగువారికి ఎదురైనపుడెల్లా వారు మిక్కిలి భీతి నభినయింతురు. పిస్టలుగురి యెక్కువగా పద్మాగం వైపునకే తిరుగు చుండును. ఇట్లు కొంతేవడికి, అందరుకలిసి జీవనరావును బంధింతురు. పిస్టలుమాత్రము పోలీసుఉద్యోగియే లాగుకొనును.)

జీవన:—ఓసీ, మాయలాడి! మంజువాణి! నాసొమ్ముదిని నాకే ద్రోహంచేశావుగా? మంచిది! గుండెలో వ్రాశిపెట్టుకో!

గోపా:—నేనబోయ్యేదం లేనండి అన్నగారు!

మంజు:—ఇది నాతప్పు గాదు, మీ మీ వృత్తివుద్యోగాలలో విధి లేనప్పుడు మీ రెల్లాసంచరిస్తారో అల్లాగే నేనుగూడా నావృత్తి వ్యాపారాల్లో విధిలేక తప్పనిసరిగా తప్పించుకోవలసిన యిల్లాంటిఘట్టాలు తటస్థించినప్పుడు నేనుమాత్రం యేంచెయ్యగలను. ఈతప్పు వృత్తిదిగాని నాది గాదు.

పద్మా:—అడడడా! ఈపొద్దు నిండా మంచిదినం, అయ్యా పిస్టలు పిసకలె. లేకుంటే! గుండుగుండెగుండా దూరుపోయిడిసివుండేది. రిపేరీముద్దులో లీతగుంజిడి స్తివి. నమకేన్న. అడడా! యెంత మోసం యెంతమోసం. (నిష్క్రమించును.)

[పోలీసుఉద్యోగి జీవనరావును బంధించి జవాన్లతో]

పో॥ఉ:—నడవండి స్టేషనుకు, జాగ్రత్త!

(జవానులు బంధింపబడిన జీవనరావుతో నిష్క్రమింతురు)

గోపా:—తినే, తినే అన్నం వదలివచ్చినందుకు తిక్కతిరిగింది బాబూ, బుద్ధివచ్చింది. మహామారీ! మాయలాడీ! మంజువాణీ! యిక శెలవు.

రాము:—అందమనే దెప్పలతో నిండిన మాఅక్క చెరువుకు నీబోటి కప్పలు పదివేలువచ్చు! నీలెక్కేంది! నడూ!

మంజు:—అంతే కాక మరెంత!

గోపా:—బాగా బుద్ధిచెప్పావు! డబ్బిచ్చి విద్యనేర్చుకున్నట్లే, డబ్బిచ్చి బుద్ధికూడా నేర్చుకున్నాం.

[చెంపలు వాయించుకొనుచు నిష్క్రమింప యవనికజారును]

# దీ న బం ధు

## ద్వి తీ యాం క ము

### ★ ప్ర థ మ రం గ ము ★

స్థలము:—సత్యానందస్వామి మందిరము

(ప్రవేశము, సత్యానందుడు బల్లవద్దకుర్చీపైకూర్చుండి వ్రాయుచూ చేతనున్న కాగితములను తిలకించుచూ ఆలోచించి)

గీ. లేదు మార్గంబు జ్ఞానంబు ♦ లేక నరయ
లేదు సాధన స్థిరబుద్ధి ♦ లేక తెలియ
లేదు మోక్షంబు ధర్మంబు ♦ లేక జేర
లేదు జన్మంబు నిను వేడ ♦ లేశమయిన.

లేదు! వీల్లేదు. వెదికాను, చదివాను, ధ్యానించాను పూజించాను, శక్తివంచనలేకుండా తలపగులగొట్టుకొని వివిధవిధాల ప్రయత్నంజేసినిన్ను గురించి తెలుసుకోడానికి సులభమైనమార్గం యిదిఅంటూ కనిబెట్టి ప్రపంచానికి చాటుదాం అనుకున్నాను గాని! కనుపించీ కనుపించనట్లు, అందీ అందనట్లు, తోచీతోచనట్లూ, తెలిసీ తెలియనట్లూ, నీవిషయం అంతా అయోమయం అగమ్యగోచరం. కంటికి కనుపించే సర్వప్రపంచం, సర్వప్రపంచాన్ని చూడగల్గు యీకన్నులు కంటికి అగోచరంబైనబుద్ధి, బుద్ధికి దురూహ్యమైపుట్టించి, పోషించి, నశింపజేయగల నీమాయనుగాని, నిన్నుగాని తెలుసుకోటం, నాయట్టివాని కసాధ్యం. కావుననే నిన్నుగూర్చి రచించుచున్న నాయీ తరుణోపాయ తర్కావళియందు, యీ యధ్యాయమున యీపద్యం తృప్తికరంగా యిట్లు వ్రాయగలిగాను.

(వ్రాయుచున్న కాగితము చూచి చదువును.)

గీ. ఏమొ నినుగూర్చి మనసులో ♦ ఎరిగినంత
వ్రాయవలెనన్న చేయియున్ ♦ వ్రాయరాదు
నీదు మర్మంబు జగతి తా ♦ నెఱుగరాదొ
లీల వర్ణింప భాషయే ♦ లేదొ దేవ.

సర్వాసనములును, సర్వశబ్దములును, సర్వాక్షరములును, సర్వస్వమును నీవైయున్న ఓసర్వేశ్వరుడా! నిన్ను తెలుసుకోడానికి, నిన్నుచూడడానికి యీకన్నులు పనికిరావు. ఎందుకంటే, ఒకవస్తువును చూడడానికి చెవులెల్లా పనికిరావో, అలాగే ఒక శబ్దాన్నివింటానికి యీకన్నులు నిరుపయోగం. వస్తువులను రుచిచూడడానికి ముక్కెల్లా పనికిరాదో, పుష్పసుగంధాన్ని ఆఘ్రాణించడానికి నాలుకకూడా చేతగాని పని. అలానే నిన్నుచూడాలంటే మానసికనేత్రంతో తప్ప యీభౌతిక నయనాలు, యీశారీరకశక్తి నిరర్థకం. భరతఖండంలో యిదివరకు జన్మించిన మహాఋష్యాగులు, మహాత్ములు, సిద్ధులు, వీరందరూకూడా ముచ్చిమూకమాటల్లో చెప్పలేని నీమర్మాన్ని నేనుచెప్పాలనుకోటం వట్టివెఱ్ఱితనం; పోనీ ఊరకుందామా! సర్వశక్తులు, సర్వగుణములుగల నీయొక్క గొప్పను తెలుసుకోలేక తప్పుత్రోవల సంచరించే మానవులు చచ్చుచూ, పుట్టుచు మరలచక్రాతచరణులగుచుండ వలసినదేనా? పుట్టని చావని త్రోవ వెదకికొనక మొండికిబడి, పాపంఅనేమత్తు పదార్థం అలవాటై ఎన్నికోటానుకోట్ల జన్మలైనా ఎత్తడానికి ఆయత్తపడివుంటే, చూపలేక భగవంతుడికే విసుగుపుట్టి చివరకు మోక్షం ప్రసాదిస్తాడా? వట్టిమాట! ప్రపంచంలో యీవరకు జన్మించిన మతకర్తలగు మహాపురుషుల మేధస్సులన్నిటిని ఒక్కచో చేర్చి మతగ్రంథాలనే గాక ప్రపంచంలోగల సర్వధర్మశాస్త్రాలను వెదకించితే చివరకు అన్నిగ్రంథాల్లో దొరికే సారాంశం ఒక్కటే! భగవంతుడు ఒక్కడనియు పాపాత్ములకు నరకమనియు పుణ్యాత్ములకు మోక్షమనియు చివరకు తేలిపోతుంది. దీనికి వ్యతిరేకంగా

ఏదైనా వుంటే అదిమతంగాదు! శాస్త్రంగాదు! (అని వ్రాయు చుండును.

(సారంగపాణి ప్రవేశము)

సారం.— నమస్తే: గురూజీ!

సత్యా:—సర్వేశ్వరార్పణం, బాబూ! ఆశ్రమవిశేషాలేమిటి? క్రొత్తగా ఎవరొచ్చారు?

సారం:— గురూజీ! మొన్న తాము పంపిన అమృతానంద స్వామి వారికి ఆయన శిష్యులకు తగు వసతి ఏర్పాటుచేసాను గాని...

సత్యా:— గానీ! ఏమిటి? అనుమానం!

సారం:— తమకు చెప్పే అంతటివాడనుగాను. కానీ తాము ప్రతి వారిని నమ్మి ఆశ్రమంలో ఆశ్రయంయిస్తూవుండడంవల్ల ఆశ్రమాని కయ్యే ఖర్చు అధికమై ఆర్తుల కన్యాయం కలుగుటే గాక ఆదాయంకోసం మరల ప్రయత్నం చేయవలసివస్తుంది. అంతేగాదు. తమ ఆస్తి అమ్మి యిచ్చిన లక్షరూపాయలు, చందామూలమున తెచ్చిన లక్షరూపాయలుగూడా చాలవేమో నని భయమేస్తుంది.

సత్యా:— భయమెందుకు? భగవంతుడు లేడా! మనం చేసేది మంచి కార్యం. లేనివాడే లేకివేషాలు వేస్తాడు. కానీ! తిననీ! వాడికి కూడ అంతరాత్మ అనేది వున్నదిగా? ఆ ఆత్మను అనుసరించే పరమాత్మగూడా వుంటుంది. అదైనా సత్యాన్ని గ్రహించి ఆత్మతోపాటు ఆనందిస్తుంది. కాషాయాంబరాలు ధరించి కల్లలాడేవారు వుంటారు. అపూర్వ దుస్తులను ధరించి అసత్య మాడనివారుకూడా ఎందరో ఉన్నారు. ఇది ప్రపంచం. దీన్ని మార్చే హక్కు కర్తకూ కాలమునకూ తప్ప మనకు లేదు. అనాధను అన్న వ్యక్తిని ఆదరించడమే మన ఆశ్రమము యొక్క ఆదిమ నియమం. అడిగేవారికి యిచ్చేవాడికికూడా ఆధారం ఎవరో ఎరుగవా?

గీ॥ తనువు ఎవ్వడు నిర్మించె ♦ తనది యనగ
ప్రాణమెవ్వడు గల్పించె ♦ పట్టియుంచ

ధనము ఎవడేని దెచ్చెనా ♦ దాచియుంచ
నీకు నాకును దిక్కు బో ♦ యీశ్వరుండె.

సారం:— క్షమించండి ఆత్మజ్ఞానం లేనివాడను.

సత్యా:— క్షమించడానికి ఒక్క పరమాత్మకు తప్ప మానవులకు అధికారమే లేదు. తెలియని విషయం తెలియపరచి మంచికి మార్గం చూపటమే మానవధర్మం.

[సారంగపాణి కొన్ని ఆశ్రమమునకు చెందిన కాగితములపై సత్యానందునిచే సంతకము చేయించుచూ]

సారం:— యిది ఖర్చుపట్టీ, 2. యివి వసూలైన చందాలు 3. యీ పుస్తకం యీ నెలలో వచ్చినవారి సంఖ్య 4. గ్రంథాలయానికి తెప్పించిన క్రొత్తగ్రంథాల వివరం. 5. ఆశ్రమపాఠశాల ఖర్చులు. 6. వైద్యాలయపు ఖర్చులు. 7. నిలవమొత్తం వగైరాలు.

సత్యా:— సారంగబాబూ! నీవు ఆశ్రమానికి వెళ్ళి అమృతానంద స్వామివారిని నావద్దకు పంపు. వారికిగల అనుభవాన్ని వారు వసూలుచేసి చేసిన సత్కార్యాలను గూర్చి అడిగి తెలుసుకొందాం. నేను భోజనము ముగించి సిద్ధంగా వుంటాను.

సారం:— మంచిది, శెలవు.

(నిష్క్రమించును — యవనిక పడును)

---

# ★ ద్వితీయరంగము ★

(స్థలం — ఆశ్రమములోని గది)

(ప్రవేశము:—అమృతానందస్వామి అతని శిష్యుడు హరిరామ్ ప్రక్కచుట్టలు (Beds) పరచుకొని పరుండియుందురు.)

అమృ:—ఒరే శిష్యా హరిరామ్! చేసిపెడ్తే తిన్నావు. ఎద్దులాగ పడుకున్నావు. నీయంత సోమారిపోతును నేనెక్కడా చూడలేదురా! ఏమిలాభం జన్మ ఎత్తితే ఎంత చురుకు ఎంత చాకచక్యంవుండాలి! వూరికేవస్తుందా డబ్బు.

హరి:—ఛూ! ఛూ! ఎప్పుడూ ఏదో ఒక గొడవ చెవుకిందదోమలాగ, ఏం జెయ్యమంటావయ్యా?

అమృ:—ఒరే! నీకు దండంపెడ్తా! కొంచెము మర్యాదగా మాట్లాడు. ఎవరైనా విన్నారంటే నీపని నాపని కాస్త చెడుతూంది. గోడలకు చెవులుంటవి. భోజనంతోసహా ముప్పైరెండు గారెలు తిన్నాకొంచెము భుక్తాయాసంగా వుంది. కదల్లేను. నా కమండలంలో అగ్గిపెట్టె, సిగరెట్లు దాచాను. కొంచెము అందుకోరా!

హరి:—నీకంటె తక్కువతిన్న గాడ్దెవరయ్యా? నేనుమాత్రం కదలగలుగుతున్నానా! నీవు ముప్పైరెండు తింటే, నేను ముప్పైఅయిదు తిన్నాను. తినగానే రెండు దమ్ములు పీకి సిగరేటు నలిపి పారేశి కాస్త పరిగాను. మొదలుపెట్టావు డబ్బారేడియో! తేరగా ఆశ్రయం దొరికినప్పుడు మజా వుడాయించకపోతే లేనప్పు డనుభవించేది ఏమిలేదు. రాత్రి రెండు సీసాలు బ్రాందితెస్తే ఒక్కసీసాలోది గ్లాసెడు పోసి అంతా ఖాళీఅయింది అన్నావు.

అమృ:—ఆ, ఆ, ఏమనుచుంటివిరా! దుందుభీ! గురుస్వాముల మరచితివా, యిది మన వూరుగాదు. అచ్చోట నీవు తన్నినా పడగలం. ఆగడము చేసినచో యిరువురి ఆదాయం చెడి

పోగలదు. నీవు వెంటనే లేచి గురువరేణ్యుల పంచె కొంచెము బావివద్ద వృతికి ఆరవేసిరమ్మ్మ. ఈరోజు గ్రామంలో క్రొత్త శిష్యులకు మాదర్శనం ఇవ్వాలిలెమ్మ్మ గురుభక్తి చూపుము.

హరి:— చిక్కం చిక్కం, గురువుగారు మరచిపోయి మజ్జిగలో చల్ల పోశారు. నిన్న నావంతు ప్రకారం బట్టలు పిండి ఆరేశాను. ఈరోజు ద్వైత స్వరూపులది వంతు అయినా గురువుగారి బట్ట శిష్యుని కాళ్లమీద పడవచ్చునా? ఎంతదోషం; ఎంతపాపం యింకా తామ గురువరేణ్యులు కావడంవల్ల నా బట్టలు మీ కాళ్లమీద పడవచ్చు గాన వెంటనే వేంచేసి వంతు ప్రకారం వృతికి ఆరవేయండి. ధర్మసంశయం వదలిపెట్టండి. ఊ!

అమృ:— ఒరే బిడ్డా! అయ్యగారిపని కొయ్యబాఱచేస్తావా ఏమిటి? గోడలకు చెవులుంటవని ఎన్నిసార్లు చెప్పినా నీకు బుద్ధిలేదు. బహిర్దేశానికివెళ్ళి రాత్రి ప్రోగ్రాం ఆలోచిద్దాం పదా. గురువు గారిపాత్రకు భంగం కలక్కుండా చెంబుతీసికొని ముందునడూ.

హరి:—సరే కాని రేపు మనం లెక్కలుచూచుకోవాలి. యంత్రాల బాపతు, చందాలబాపతు, ధాతుపుష్టిలేహ్యంబాపతు యింకా యింకా ఖర్చుపోను రేపు పంచిపెట్టు. నేను యింటికి పంపించు కోవాలి,

అమృ:—నాకు మాత్రం పంపించే అవసరం లేదా? కానీ గురు కటాక్షాల్లో నీకుమాత్రం భాగంవుండదు.

హరి:—ఆ! ఆ!! నీ ఎత్తులు నాముందు సాగవు. దాంట్లో నాకు భాగం లేకపోతే దింపుళ్ల బాపతు, దయ్యాలొదిలించినబాపతు, కేపులు గొట్టిన బాపతులోకూడా నీకు భాగం సున్నా! దండం గుండప్పా అంటే ఆశీర్వాదం బోడప్పా అంటం నాకు తెలుసు.

అమృ:—అబ్బా! నీ కెందుకురా యింత తొందర? సావకాశంగా మైదానానికెళ్ళి మాట్లాడుకొందాము. మళ్ళీ తీర్థంతెచ్చి మజా వుడాయిస్తాం. కొంచెం శాంతించూ లే! లే!

హరి:—ముందు మీరు లేచి నన్ను లేపండి.

(అని చేయి యిచ్చును గురువుగారులేచి శిష్యుని లేవనెత్తుచూ)

అమృ:—లేరా దున్నా, యిప్పుడే వద్దాం (యిరువురునిష్క్రమింతురు. సారంగపాణి ప్రవేశించును)

సారం:—ఏరీ యీ గురుశిష్యులు! వీరితో కలిసి సావకాశంగా మాట్లాడుదా మనుకుంటే లోపల జేరితే తలుపులు తియ్యరు, బయటికెళ్ళితే కనుపించరు. చిత్రం. ఇట్లాతింటూ వృధాగా కాలంగడుపుతూ ఆశ్రమానికిజెందిన ఆహారపదార్థము వ్యర్థం చేస్తూవుంటే నేను చూస్తూ వూరుకోవటం ఎల్లాగ! వచ్చిన పని ఏదో యింతవరకు తెలుపకపోగా ఆశ్రమాధిపతియగు మాగురువుగారితోగూడా వెళ్ళి సావకాశంగా ప్రసంగం జరుపలేదు. ఎన్నిసార్లు వారియొద్దకు వెళ్ళుచున్నా ఏదో క్రొత్త జపంచేస్తున్నాం అంటారు, దారీ తెన్నూలేక దరిద్ర పిశాచంతో తరుమబడిన వారికిగాని యీశరణాలయం! పనీ పాటలేక పరధ్యాన్నమంటూ పండిన ధాన్యాన్ని పాడుచేసే యిలాంటి పందికొక్కులకు ఆశ్రయం యిస్తే, లింగం, గుడి గోపురంకూడా మింగేస్తారు. ఎక్కడికి కెళ్ళివుండవచ్చు వీళ్లు!

[అనుచు అటుయిటు తిరుగుచుండ, అమృతానందుడు పండుకొన్న ప్రక్కబట్ట సారంగపాణి కాళ్ళకు తగిలి చెదరగా ప్రక్కక్రింద దాచబడిన "పడకటింటిముచ్చట్లు" అను గ్రంథం కనుపించును.)

సారం:—(పుస్తకము నందుకొని నివ్వెరపోయి) ఔరా! యిదేమిటి? పడకటింటి ముచ్చట్లా, బేష్! బేష్! పరమయోగులకు "పడకటింటిముచ్చట్లకు" గల సంబంధం చిత్రాతిచిత్రం. ఇదంతా ఏదో అనుమానాస్పదం.

(అనుచూ ముందునకు నడచి అచటగల జింకతోలుతో కట్టబడిన ఒకసంచిని విప్పిచూచుచు అందుండి వరుసగా ఒక హేర్ ఆయిల్ సీసా, వైట్ రోజ్ సబ్బుబిళ్ళతీసి)

విరాగులకు విభూతితోబాటు విలాసవస్తువులు గూడా వుండాలని నాకింతవరకు తెలియదే! (మరల సంచినుండి ఒకచీట్లపేక

దస్తా దీసి) సరిసరి, బాగుంది. మనసులో వున్నంతే సోదిలోకి గూడా వస్తుంది. స్వాములవారు చతుర్వేదపారాయణానికి బదులు యీ చతురాశీయ పారాయణ చేస్తారనుకుంటాను.

(మరల ఒక అత్తరు సీసా, ఒక షేవింగుసెట్టూ రెండుమూడుగ్రంథాలు, వీర్యవృద్ధిలేహ్యముసీసా (M & B 693) మాత్రలడబ్బీ కొన్ని తాయెతు గొట్టాలు ఒక భగవద్గీత మొత్తం ఒకదానివెంట నొకటి తీయుచూ,)

గురూత్తములకు వీర్యము క్షీణించటంచేత వీర్యవృద్ధికి లేహ్యాము, సుఖసంకటాల నివర్తికి యం. అండ్ బి. 693 మాత్రలు, పరిమళానికి సెంటుసీసా. ఆహా బేష్! యింకేం గావాలి! సన్యాసుల మంటూ సర్వాపురుషులకంటే ఎక్కువగానే అనుభవిస్తున్నారు. ఔరా! జగద్గురువులకు తిరుమంత్రం చెప్పే బ్రహ్మాండగురువులు. వీళ్ళకు ఆశ్రయం యిస్తే ముందు అనేక ప్రమాదాలు రావచ్చు.

ఉ. వచ్చియు పోయి కెందరిటు ♦ వచ్చెద రెందరు నింకమీద తా
సచ్చరితాత్ములే యయిన ♦ శాశ్వత గౌరవమున్ గడించి మే
మిచ్చెడి యన్నమున్ గుడిచి ♦ యోలని బోదురు శక్తి హెచ్చి తా
మ్రుచ్చులు చోరులే యయిన ♦ మూలధనంబుల తస్కరింపరే.

ఇల్లాంటి వాండ్లు ప్రస్తుతం ప్రపంచంలో చాలామంది వున్నారని గురువుగారితో ఎన్నిసార్లు మనవిచేసినా వారికీ ఆత్మఅనేది వున్నదంటారు. కాని వసతిలేదు అని అనలేరు. ధర్మరాజు, ధర్మరాజేమిటి? అతనుకూడా అవసరాన్నిబట్టి అశ్వద్ధామ హతః కుంజరః అన్నాడు నోటివెంట. మా గురూజీ అవసరంరానీ, అంతా నశించనీ అంత పొల్లుమాట నేను వచ్చిన యిన్నాళ్లనుండి ఎరుగను. అందుచేతనే; వారియందు నాకు గురుభావం అంతేగాకుండా పితృభావం కూడాను. లక్షపోనీ ఒక్క ఆత్మకు మనవల్ల తృప్తికలిగితే అంతేచాలంటారు, నివురుకప్పిన నిప్పులాగ యిలాంటి త్యాగులు సత్యశీలురు మనహిందూదేశములో ఇంకావుండబట్టే, భరతఖండం

బొంబులపాలుగాక బయటపడింది. గురువుగారు ఆశ్రమానికి చెందిన అన్నివిషయాలు నామీదనే వుంచినందున అసత్యాన్ని గానీ, అన్యాయాన్నిగానీ ఆశ్రమములో అడుగుపెట్టనీయను. యిదే నా నిశ్చయం. అహాహా! మంచి మహాత్ములే తటస్థించారు మాకు. ఛీ! ఛీ! యిదేమి విపరీత వ్యవహారం.

(హరిరాం ప్రవేశించును)

హరి: — ఫలహారం! ఫలహారం!! గురువుగారూ దయచేయండి దయచేయండి. ఆశ్రమాధికారులు పాపం ఫలహారం తెప్పించి మనకోసం ఎదురు చూస్తున్నారు.

అమృ:— (ప్రవేశించి) సద్గురుభ్యోనమః! అయ్యయ్యో! మేము కొంచెం అవసరం తీర్చుకోవడానికి ఆవలికివెళ్ళాం. అబ్బా! ఎందు కింత శ్రమ మీకు? ఫలహారం తాము స్వయంగా పట్టించుకొని రావాలా! ప్రాముఖ్యత పరమాత్మకు గాని ఫలహారమున కెందుకు?

హరి:— అవు నవును సత్యం! సత్యం!! సద్గురుభ్యోన్నమః

సారం:— పరమయోగులు తాము. అట్టి ఆధ్యాత్మిక విషయాలు పామరుడనగు నా కేమెరుక?

అమృ:— ఆ, ఆ, చిత్తం చిత్తం! ఎక్కడికిలేండి; పాండిత్యం పామరత్వమున్నా ఆ సద్గురు కటాక్షంవల్ల చాలావరకు వాడి విషయం మనసుకు పట్టిచ్చుకొన్నంత మాత్రాన గర్వపడుతానా? ఇంకా ఎంత వున్నదీ!

సారం:—అయ్యా బాగాఅన్నారు. సద్గురు కటాక్షంవల్లనే కొంత తెలుసుకున్నా యింకా ఎంతవుందీ అంటూ వున్నారు. వూహాతీతము. ఎంతవుందో తమకే తెలియాలి తమవిషయం. కానీ తమరు దయచేసి తక్షణం యీ గది ఖాళీచేసి మాకివ్వాలి. అనాధయై అన్నంలేక ఆత్మహత్య చేసుకోనెంచిన ఒకవ్యక్తిని అపాయం నుండి తప్పించడానికై యీ ఆశ్రమానానికి పంపబడ్డది. ఆమెకు అవశ్యం ఆశ్రయం యివ్వాలి.

[అమృతానందుడు, హరిరాం చెవులు మూసుకొని]

అమృ:—శివ! శివా! ఆత్మహత్యా ప్రయత్నాపాపం నశించుగాక! నశించుగాక!! (ప్రకాశముగా) అయ్యా! ఆ కాంతెవ్వరో యిటు పంపండి. ఒక చిన్నమంత్రోపదేశముచేసి ఆమె మనసు క్షణంలో మార్చేస్తాను.

సారం:—క్షమించండి, మనస్సు మారడానికి మంత్రోపదేశంకోరడం లేదు ఆమె! మాడేపొట్టకు గంజి అడుగుతుంది.

హరి:—పొట్ట మాడ్తుందట, పాపం ఎంతజ్వరం వచ్చిందో!

అమృ:—అయితే ఆలస్యం ఎందుకూ? సర్కారు ఆస్పత్రికి వెంటనే పంపండి. బాగా తెలిసిన డాక్టర్లుంటారు.

సారం:—చాలు! అనవసరంగా తిని అడ్డంగా బలిసిం దనుకున్నారా, అన్నం లేదని అల్లాడుతూంది. అన్నంబెట్టి ఆత్మారాముడ్ని శాంతిపర్చాలి.

హరి:—అయితే, యింకేం; అట్లాగే చేయించండి.

సారం:—అట్లా చేయడానికే అయ్యగార్ని ఆవలకు పంపి ఆమెకు ఆశ్రయం యివ్వాలనేది. పిల్లలతో వుంది. అన్నిగదులు నిండి వున్నాయి, అత్యావసరం.

అమృ:—అవసరం లేందెవరికిలేండి. అన్నిగదుల్లాగ యీగదిమాత్రం ఆక్రమింపబడివుండ లేదా?

సారం:—అన్నిగదులు ఆర్తులతో నిండివున్నవి. యీగది అన్యాయంతో నిండివున్నది! అందుచేతనే తాము అవతలికి సర్దుకోవాలి,!!

హరి :— ఆ! ఆ!! ఎవరి ఎదురుగా నిలచి మాట్లాడుతున్నావో తెలుసా? శ్రీ శ్రీ శ్రీ అఖిల భూమండల వేదమతాచార్య రాజ హఠయోగ సిద్ధ, శాకినీ, ఢాకినీ, భేతాళాది. భూత, ప్రేత, పిశాచ, వశీకృత, ప్రయోగమార్తాండ, దర్ప, ప్రతివాదిభయంకర, శ్రీ విశ్వగురు అమృతానందస్వామిని ఎది

రించి మాట్లాడిన వాడెవ్వడూ గూడా వారం రోజులకన్నా
ఎక్కువ బ్రతకలేదు. తెలుసునా?

(అమృతానందుడు తన జంధ్యమునందు కట్టబడిన జానెడు పొడుగుగల తాయెత్తును బయటకుతీసి గుడ్లుత్రిప్పుచూ మంత్రించువానివలె అభినయించుచుండును.)

సారం:—ఓహోహో! యింత పెద్దబిరుదు ఒకరిచ్చిందికాదు. మంచి రోజు చూచి మీరే పెట్టుకున్నట్లుంది. యిటు వినండి, సత్య ధర్మ విద్యాభూషణ బిషగ్ పురంధర గ్రామ్యపద క్షుద్ర దుమోన్మూలన,సూత్రవాక్యోద్దాళికుండనేగాక జారచోరాది కృత్రిమ వేషభాషాది మానవ బంధనార్థం పోలీసు దూతా ప్రయోగ సామర్థ్య దురంధరుండనగు నాశక్తి నిదే చూడగలరు. (ప్రకాశంగా) ఎవర్రా! అక్కడ!! (లోపల-అయ్యా!) నీవు వెంటనే పోలీసు స్టేషనుకు వెళ్లి పోలీసు అధికారియగు అల్లాబక్ష్ సాహెబు గారిని నేను పిలుస్తున్నానని వెంటబెట్టుకొని రారా!

(తెరలో చిత్తం)

అమృ:— ఏమిటా తొందర మీ గురువుగారినే పంపండి. వారు మేము సమాన స్కందులం కాబట్టి మా గొప్పవారి కెరుక. గుమాస్తాలుమీరు! గురూత్తములతో ముఖాముఖిని మాట్లాడే అధికారం మీకెక్కడిది?

సారం:— మీతో మాట్లాడే అధికారం నాకు లేదు. మా గురువుగారికి లేదు, కాబట్టి మీతో మాట్లాడే అధికారంగల అధికారినే పిలిపిస్తున్నాగా. మీగొప్పలు తిప్పలు ఇప్పుడే తేల్తవి. తొందరెందుకు?

అమృ:— పవిత్రులమైన మా యట్టివారిని గుర్తించనేరని యిట్టి మఠంలోవుండడం మాకే అవమానం (హరిరాము నుద్దేశించి) ఓయి శిష్యోత్తమా వెంటనే బెడ్సుచుట్టి సంచులు సర్దూ!

హరి :— చిత్తం! చిత్తం!! శీఘ్రబుద్ధేః పలాయనం అన్నారు పాపాత్ములను పట్టి. అంటేపోలీసువారి ముఖం పరమార్థ మెరిగిన పండితులంచూస్తామా? వారువచ్చేదాకా మేముంటామా!

చాలు యీ మర్యాద 'కొండ అద్దమందు కొంచెమై వుండదా'' మరి

(అని గురువుగారి పక్క చుట్టుమూ శాళ్ళవెపునవుంచబడిన శాలువామడతను విప్పి తలగడమీదనుంచబోగా, శాలువామడతనుండి అందు దాచబడిన బ్రాందీసీసా క్రిందబడి పగిలి అందున్న బ్రాంది చింది సారంగపాణి చేతిమీదపడగా బ్రాందీవాసనను భరించలేక, అసహ్యించుకొనుచూ)

సారం:—ఛీ! ఛీ! రామ! రామ! బ్రాందిరా బాబూ, పాపం పగిలింది. చెయ్యన్నా కడుక్కుందాం. వాసన.

(అని అక్కడిగల కమండలం ఎత్తి చేతిమీద వంచుకోగా కమండలంనుండి మట్టలు, సిగరెట్లు, అగ్గిపెట్టె ద్వారా చేతిమీద పడగా?)

ఓహోహో! ఎంత పవిత్రులు! దేశ మరామత్తు సంఘానికి అధ్యక్షులు, ఎంతమందిని దిగగొట్టిగి మంగళం పాడారు నాయనా గురువులమంటూ.

అమ్మ:—ఇది ఒక తప్పా! ఏదో మాశిష్యునికి అకస్మాత్తుగా కడుపు నొప్పివస్తే వైద్యానికి బజారునుండి యింత బ్రాంది తెప్పించాను. (ప్రకాశముగా) చుట్టరా! నీప్రక్కగూడా, వారు మనలను అపార్థంచేసుకొంటూన్నారు.

హరి:—(తాను పండుకొన్న ప్రక్కబట్ట దులపగా దానినుండి ఒకపేమక్కప్పు క్రిందపడును. మరియు ప్రక్కక్రింద ఖాళీవి 6 సారాయి సీసాలు కనుపించును.)

సారం:—సత్రం కట్టిస్తున్నానని చందాలు వసూలుచేసి సారాయి బుడ్లకు ఖర్చుపెట్టే మహాత్ములా మీరు? మాగురువుగారిని సులభంగా నమ్మించి యిదివరకే పందలు వేలు కాజేసినట్లే మళ్ళీ కాజేద్దా మనుకున్నారా? జాగ్రత యీ సారంగపాణి మీఆటలు సాగనివ్వడు.

హరి:—పుణ్యంగట్టుకున్నావుగా నాయనా, నీ సొమ్మేం పోయింది. ముందే మాట్లాడుకుంటే నీకుమాత్రం భాగంలేకుండా పోయేదా?

సారం:—చాలు, నోటికి తాళంవెయ్యి. నేను మీ సంచిలో వుండే సామానుమాత్రమే చూచి ఎంతో అనుమానపడ్డాను. దానికి

పదిరెట్లు యిప్పుడు బయటపడ్డది. యిదిగాక మాటలుగూడా మారిపోతున్నాయి. బజారు వూడ్చిపోసే చెత్తకుండి ఎంత పవిత్రమైందో మీ జీవితంలోకూడా అంతే పవిత్రత వుంది. చెత్తకుండీ అయినా ప్రజలకు ఎంతో వుపయోగపడుతున్నది; గాని కేవలం కృత్రిమ కల్మషం శరీరంలో జీర్ణించిన మీ రక్తమాంసములను పొరపడి ముట్టిన నక్కలకు పిచ్చికూడా ఎత్తగలదు. తక్షణం నడవండి, లేకపోతే అర్ధచంద్రప్రయోగంతో శ్రీకృష్ణజన్మస్థానం చేరగలరు.

అమృ:—త్వరగా ఎత్తుకోరా సామాను, వెళ్ళిపోదాం మనకు భయమేంటి?

హరి:—భయమే లేనప్పుడు సిగ్గుకూడా ఎందుకు? నిండా మునిగితే చలే వుండదు. ఎద్దు బరువు ఎవడు మోస్తాడు? నీది నీవెత్తుకో, నాది నేనెత్తుకుంటాను.

అమృ:—ఆదాయం వచ్చిందంటే అంగ ముందుకు, అవసరం వచ్చిందంటే అరమైలు వెనక్కు వుంటావు. నీసంగతి నాకు తెలియదా! శ్రీ మద్రమారమణగోవిందో హరిః

[అని ప్రక్కచుట్ట నెత్తుకొనును.]

హరి:—భద్రాచలవాసా గోయిందా! గోయిందా!

(అని ప్రక్కచుట్టనెత్తుకొని సంచి చేతబట్టును.)

గురు-శిష్యు:—శెలవు శెలవు. మీరు పిలచినా ఈసారి రాం!

సారం:— అయ్యో పాపం! యింత పుణ్యాత్ములు శీఘ్రంగా వెళ్ళుతున్నందుకు చింతిస్తూన్నాను.

హరి:—అంటే పోలీసువారు రాకముందే దాటుతున్నామని విచారపడ్తూన్నావా! సెలవు (నిష్క్రమింతురు)

సారం:—వెంటనే పుణ్యాహవచనం చేయిస్తేనేగాని గదిపవిత్రంగాదు.

(అంటూ సారంగపాణి నిష్క్రమించును.)

## ★ తృతీయ రంగము ★

స్థలము : అద్దెసత్రములోని ఒక చిన్నభాగము

ప్రవేశము : సుగుణ

(సుగుణ శంకరుని పటమునకు ఎదురుగా కూర్చుండి భజించుచు, పాట ముగించి)

సుగుణ:—ఈశ్వరా! తండ్రీ! సకల దుర్మార్గాలు వృద్ధిబొంది పాప ఫలం పండి పడనున్న ఈ విపరీతకాలంలో నే నేబంధువుల యింటికి వెళ్ళి ఎవరి పంచబడి వ్రాడికం చేయగలను? వలదు. మనకు తగదు తగదని ఎన్నివిధాల చెప్పినా వినక చివరకు నాకు పిల్లవానికి కూడా ఈ దుర్దశ తెచ్చి పెట్టారు. మనస్సును మార్చ లేక మనిషినే బంధించారు న్యాయమూర్తులు. చిన్న తప్పుకైనా పెద్దశిక్షే విధించారు. దుర్దశ కలిగినప్పుడు కాళ్లు మొక్కి తిరిగే బంధువులు, స్నేహితులు లేనప్పుడు లెక్క చేస్తారా? కల్ల. దినం ఒక్కయుగంగా గడిపాను ఈ నాలు గేళ్లు. త్వరలోనే నా జీవనాధారం; నా భాగ్యం నాసుఖం నాదేవత, నా శరీరానికి, నా ప్రాణానికిగూడా జీవనం, నా నాథుడు జయిలునుండి విడుదలై రాగలడు. ఓ అనాథ రక్షణోదక్షా! అర్ధనారీశ్వరా! ఆకలిబాధతో ప్రాణాలు వదల టానికైనా వెఱువక మానాన్ని రక్షించుకొంటూవున్న నన్ను అవమాన పిశాచం అంటకుండా వరం ప్రసాదించుతండ్రీ! తుపానులో చిక్కబడిన నావలాగున వున్న నన్ను రక్షించ డానికి ప్రశాంతహృదయుడవైన నీవుగాక మఱెవ్వరు దిక్కు? ఈ రోజు యమకింకరునిలాగ సత్రం గుమస్తా అద్దెకొఱకు మళ్ళీవస్తాడు. నల్లపూసల్లో పచ్చపూస లేకుండా సర్వం అమ్మి మర్యాద కాపాడుకొంటూ నా కసికందుని రక్షించు కొంటూన్నాను.........

(బడినుండి పలకపుస్తకములతో నవజీవన్ ప్రవేశము.)

నవ:— అమ్మా ఏమికొన్నావే నాకోసం! త్వరగా యివ్వు. చాలా ఆకలేస్తుంది. మాబళ్ళో పిల్లలందరూ అన్నంతినే బడికి వస్తారట

నాకు మాత్రం నీవు ఒకరోజు గంజిపోసి ఒకరోజు ఏదీ లేదంటావు.

సుగుణ:—(చెరగు కన్నుల కద్దుకొని మరల ధైర్యముతో) నాయనా! కడుపు నిండా సందు లేకుండా తిని బడికి వెళ్ళితే చదువెక్కడ వస్తుంది? వాళ్ళలాగ నీవు కడుపునిండా తింటే బొజ్జపెరిగి మొద్దబ్బాయి వౌతావు.

నవ:—అమ్మా! కడుపంతా చదువుతో నిండిపోతే అన్నం ఎక్కడ పడుతుందే మరి?

సుగుణ:—నాతండ్రీ! అందుచేతనే ఆరునెలల కొకసారి పంతులుతో సహా బడీ, బజారు, వూరుకూడా మార్చి మరియొక బళ్ళో నిన్ను చేర్చేవరకూ విద్యోపవాసము చేయిస్తూవుంటానుగా ఆహారం బాగా జీర్ణంగావడానికి ప్రతి ఏకాదశీ నేను ఉపవాసంవుండేలాగ!

నవ:—ఏమోనే! చదువు లేకపోయినా బాగా ఆడుకుంటానుగాని అన్నం లేకపోతే అసలే నడవటానికే చేతగాదమ్మా. (తెరలో కిరాయిదారు సరసయ్య బిగ్గరగా) ఏమండోయి! అమ్మగారూ! అడిగడిగీ ప్రాణం విసిగింది. మీరు కిరాయ యివ్వరూ, నేను తీసుకోను గానీ; యీ అయ్యగారికి పంచలో కొంచెము జాగా యివ్వండి. రెండురోజులు వుండి వెళ్తారు పాపం.

(అనుచుండగా, అమృతానందుడు హరిరామ్ బెడ్డు నెత్తిన బెట్టుకొని గుడ్డచుట్టబడిన ఒక టిఫిన్ క్యారియర్ చేతబట్టి ప్రవేశింతురు:)

హరి:—దించవయ్యా, దింపుడుకల్లం. పేరు గొప్ప వూరుదిబ్బ. నేను బస ఏర్పాటుచేసిందాకా బెడ్డు గంగానమ్మ పెట్టెలాగ నెత్తిన పెట్టుకొని తిరుగుతావుకాని ఎడారిలో బ్రతికే ఒంటెకుండే బుద్ధిలో వెయ్యోవంతుకూడా నీకు లేదు.

అమృ:—ఒరేయి, గాడిదా! ఒంటెవడురా? ఎక్కడికెళ్ళినా అగౌరంగా మాట్లాడుతావు.

హరి:—(సామాను దించి నవ్వుచూ) తెలియదా ఒంటెసంగతి. "ఒక ఒంటె చలిబాధకు ఆగలేక అరబ్బీవాని డేరాలో తల దాచుకుందామని అత న్నడిగి వాడి కిష్టంలేకపోయినా చివరకు వొప్పించి, మొదట అట్లా అట్లా డేరాలో తలకాయపెట్టి మెడకాయబెట్టి, స్వాంతం లోపలకువెళ్లి గుడారం మొత్తం ఆక్రమించి గుఱ్ఱుపెట్టి నిద్రపోయింది." అంటే ఒంటెకుండే తెలివికూడా నీకులేదని తేల్తుంది. నేను నీవెంట లేకుంటే నిలువనీడ లేకుండా నీల్గి చచ్చేవాడివి. ఇదంతా నా ధర్మం.

సుగుణ:—ఎవరు నాయనా, మీరు?

అమృ:— మేమూ అండీ! మేము కాశీయాత్ర వెళ్లివస్తూవున్నాము. వీడు నాబావమరది, సరసం ఆడ్తూవున్నాడు సన్నాసి.

(అని యిరువురు చతికిల పడుదురు.)

సుగుణ:—మహాపుణ్యాత్ములు, గంగాతీర్థం తెచ్చారనుకుంటాను.

హరి:—అయ్యయ్యో! తీర్థంకోసమేగా యిన్ని తిప్పలు. వున్నది సంచిలో భద్రంగా. రేపు సావకాశంగా మాట్లాడండి మీకు కూడా యిస్తాము.

సుగుణ:—మంచిది నాయనా మంచిది.

అమృ:— అమ్మా! మీరీగదిలో అద్దె కున్నారనుకుంటాను. పాపం మీవారి కేం పని?

సుగుణ:—(అనుమానించుచు) ప్రస్తుతం యిక్కడ లేరు.

హరి:—మనం వారిని అడుగకూడదయ్యా! కావాలంటే మనం తెలుసుకోలేమా ఎవరినన్నా అడిగి. మన కెందుకు రెండు రోజులువుండి వెళ్ళేవాళ్లం.

అమృ:—ఈ సాయంత్రానికి వంటప్రయత్నం అయిందాఅండీ. ప్రొద్దున ఏమి శాఖం ఏమి చేసుకున్నారు?

సుగుణ:— ప్రొద్దున యేదో మామూలుగానే గడిపాం. యీపూట యింకా ప్రయత్నం చేయలేదు.

అమృ:— తియ్యరా టిఫినుగిన్నె! కొంచెం ఫలహారం చేద్దాం!

హరి:— (టిఫినుగిన్నె తెరచి) వట్టి పూరీ లెట్లా తిందామయ్యా?

అమృ:—అయితే ఇప్పుడెవరిని భవతీభిక్షాందేహి అనమంటావోయ్. యీ శరీరం యింతవరకు పరాయింటి వుప్పురాయి కూడా తగలక పెరిగింది. మనకున్నదే మహాప్రసాదం అంటూ తిని నీళ్ళు తాగుదాం.

హరి:— నీకేంబావా! లక్షాధికారివి. యే యాత్రకెళ్ళినా గోదానాలు భూదానాలంటూ ఆచేత్తో ఈ చేత్తో యెగజల్లి ఆర్జించుకొన్నావు పుణ్యం. యాత్రాసమయం వసతిగానిచోట యెట్లాగైనా సర్దుకోవాలి. ఈ మాత్రానికే నీ గౌరవం పోతుందా? (సుగుణతో) అమ్మా మీ యింట్లో ఉదయం చేసిన శాఖంయేదైనా ఉంటే యిలా యిప్పించండి కొంచెం, (నవజీవనుని చేయిబట్టి)రా! అబ్బాయి! కూర్చో పూరీతిందాం.

(పిల్లవానిని కూర్చుండబెట్టి పూరీ చేతికిచ్చును.)

సుగుణ:— (అనుమానించుచు) అయ్యా! పొద్దున చేసిన కొబ్బరి పచ్చడిమాత్రం వుంది. పనికొస్తుందా?

అమృ:— (పూరీని కొంచెము కొంచెముగా తినుచూ) పచ్చడేనై! తెండి త్వరగా.

సుగుణ:— కొంచెం పెరుగు కూడా వుండాలి. తెస్తా!

(అని లోనికేగి ఆకులో కొంచెం పచ్చడి తెచ్చిముందుంచగా అమృతానందుడు పచ్చడి నంజుకుంటూ)

అమృ:— అహా, హ హా! ఒక్కొక్క చేతిలో ఏం రుచివుంచాడో గాని భగవంతుడు పచ్చికారంతో యింత వుప్పు నలిచి పెట్టినా షడ్రసోపేతంగా వుంటుంది. ఒక్కొక్క తల్లి అన్ని మసాలాలతో అరడజను తాలింపులుపెట్టి సాంబారు తయారుచేస్తే తలకు పోసుకునేటప్పుడు నోట్లోకు జారే సబ్బు రసంలాగానే వుంటుంది. ఒక్కొక్క యిల్లాలు అల్లపు పచ్చడి నూరితే కుంకుడుకాయ పచ్చడిలాగ తయారౌతుంది. ఒక్కొక్క గృహలక్ష్మి హస్తంతో ఆవునెయ్యిపోసి వండిన పిండివంటలు పిడకవంటల్లాగ తయారైతే అందులో పోసిన

నెయ్యి బర్మా షెల్ కంపెనీవారి నూనెకన్నా అన్యాయమైన కంపుకొట్టుంది. ఒక్కొక్కరికి బ్రహ్మదేవుడు నిజంగా ఆ రుచి అంతా అరచేతుల్లోనే అద్ది పంపుతాడు. లేకపోతే నే పచ్చి గడ్డితో నూరిపెట్టిన పచ్చడికే ఘనంగామెచ్చి గరికపాటి అగ్ర హారాలంటూ యిస్తారా నవాబులు మహారాజులు! నాలుగు భాషలు చదివిన నళినాక్షి నలభీమపాకశాస్త్రం చదివి హల్వా వండితే అడుగంటి అడుసులాగ తయారౌతుంది. ఇదేంటంటే ఈ శాస్త్రకారుడు మంటను గురించి మరొక ధ్యాయం వ్రాయక పోవడం తప్పంటుంది. ఈ పచ్చడి ఏ నారీ, కేళీ యంత్రైనా; అధరామృతంకన్నా అతీతంగావుండి స్వర్గానికి వక బెత్తెడెడములో చేర్చింది. ఏదీ! పెరుగున్నదన్నారు; పట్టుకు రాండీ (హరిరామ్‌ను సంబోధించి) అరె పిచ్చిగాడిదా! పచ్చడంతా అప్పుడే తినేశావు. పిల్లవాడ్ని కూడా తిననియ్యి. తినూ! నాయనా, తినూ, నిన్ను చూస్తే మావాడు జ్ఞప్తికి వస్తూన్నాడు.

(సుగుణ లోనికేగి గిన్నెతో పెరుగు తెచ్చి అచ్చటనుంచును.)

అమృ:— (పెరుగును చూచి) గట్టిగానే వున్నది. పెరుగు మాత్రం తీపో, పులుపో, తింటే!

హరి:— తినబోతూ రుచి అడగరాదు. నేను బయట పంపువద్ద గిన్నె కడిగి నీళ్లు పట్టుకొస్తాను. మీరు తింటూ వుండండి.

(నిష్క్రమించును.)

అమృ:— (పూరీలు చేతిలో వుంచుకొని) పెరుగు కొంచెము వడ్డించండి.

సుగుణ:— (సందేహించుచు) మీరే వడ్డించుకోండి.

అమృ:— ఆ! ఆ! చేతిలో పూరీలు వున్నవి. మీరు వడ్డించండి పరవాలేదు!

(సుగుణ పెరుగుగిన్నె తీసుకొని కొద్దిగా వడ్డించును.)

అమృ:— (పెరుగును కొంచెము చవి చూచి) అహాహా! చక్కెర పొడి!! అమృతతుల్యం!!! ఓ హో, హో, హో, యీ

మాధుర్యం అంతా హస్తాంది కాని పెరుగుదికాదు. ఈలాంటి హస్తం నెత్తిమీద పెట్టుకొని కళ్లకద్దుకొని ముద్దుపెట్టుకోవాలి.
(అని సుగుణ చెయ్యి పట్టుకొని ముద్దు పెట్టుకొనబోవును. సుగుణ చేయి లాక్కొని గిన్నెలోని పెరుగును మూతిమీద కొట్టి)

సుగుణ:— ఛీ ఛండాలుడా! నీవంటి తుచ్ఛులగు వేనవేలు మోస గాండ్రకు గురువగు జీవనరావు ధర్మపత్నినైన నన్ను నీవా మోసగించగలేది! తుచ్ఛుడా! నీకు నాయట్టి అక్కచెల్లెండ్రు గాని, ఆడపిల్లలుగాని లేకుండొచ్చు. రారా నాయనా! కుక్కల పాత్రున గోవులు భుజింపకూడదు.
(అనుచు కుమారుని పిలుచుకొని వెడలిపోవును.)

హరి:— ప్రవేశించి నిశ్చ్వారపోయి, ఆ! ఆ! ఆ!!

అమ్మ:— ఒరే హరామ్! నీళ్లురా!! నీళ్లు!! కడగరా మొఖం అబ్బబ్బా కళ్ళు మండుతున్నాయి. అబ్బబ్బ కళ్ళుమంట.

హరి:— వుండవయ్యా దేవుడా! కళ్ళుమండబట్టే చల్లపడ్డానికి యీ పని జరిగింది. నేనూ వేడిజేసి చస్తూవున్నాను. మళ్ళీ పెరుగు ఎక్కడ దొరుకుతుందీ వేళ.
[అనుచు అతని ముఖమునకు అంటివున్న పెరుగును తీసి నాకుచూ]
'అ హ హా! ఏరికిగల్గు యిట్టి ఘనతల్ మీసాలపై మీగడల్'
(అని లొట్టలుగొట్టుచు పరిహాసముచేయుచుండ యవనికజారును.)

---

## ★ చతుర్థరంగము ★

(దృశ్యము వీధి:— సుగుణ, నవజీవనులు పాటపాడుచు ప్రవేశింతురు.)

నవ:— అమ్మా! ఎక్కడాకూడా వుండకుండా వూరూరు యిలా తిరుగుతుంటే నాన్నగారు వస్తే మనల ఎక్కడని కలుస్తారే?

సుగుణ:— నాయనా! నాల్గేండ్లకుపైగా గడిచిపోయింది. యిక రెండు మూడు మాసముల్లోనే రావచ్చు. ఈనాల్గురోజులు ఎక్కడైనా

ప్రమాదంలేనిచోట నీకు నాల్గుముక్కలు వచ్చేచోటుచూచి తల దాచుకొన్నామంటే అదే పదివేలు.

నవ:—తింటానికి తిండిలేదుకాని చదువుకో, చదువుకో అని చంపుతున్నావు. నాకు అన్నం కావాలిగాని అక్షరాలు వద్దు. చదువురానివాళ్ళుమాత్రం సంపాయించటంలేదూ!

సుగుణ:—నీకు తెలియదు. అన్నంలేక అల్లాడి ఆకలితో చావ వచ్చునుగాని, అక్షరజ్ఞానంలేక అజ్ఞానాంధకారంతో బ్రతకరాదు. ఒక నిరక్షరకుక్షి తాత్కాలికగ్రహబలంచేత ఘనుడనుపించుకొన్నా, ఆ గ్రహబలం తగ్గగానే అంట్లుతోమడానికైనా అనర్హుడనుపించుకుంటాడు. ఒక విద్యావంతుని తారాబలం, తారుమారై వికటంగా వున్నప్పుడు ధనలోపం ఏర్పడినా విద్యాలోపంగాని, విజ్ఞానలోపంగాని, కలుగనేరదు. అందుచేత, నేను నీకు స్తన్యంయిచ్చి పెంచినట్లు విజ్ఞానం కలిగించడంకూడా నావిధి.

నవ:—నీ దగ్గర నీళ్ళుతాగటానికి చెంబుగూడా లేనప్పుడు చదివించడానికి సరిపడే డబ్బు ఎక్కడ తెస్తావే?

సుగుణ:—నాతండ్రీ! యిప్పుడే తలఎత్తిన ఒకచిన్నమొక్కను కష్టపడి యిన్నినీళ్ళుపోసి నిలబెడితే వేళ్ళుప్రాకి ఎంతయినా వృద్ధిపొంది ఫలిస్తుంది. (భగవంతుని ధ్యానించుచు) హే దేవదేవా! జగద్రక్షకా! తలితండ్రికేగాక, చేపట్టిన భర్తకు యింటికీ, వూరికీ అదృష్టమునకుగూడా దూరమై శరణ్యంలేక, నిల్వడానికి నీడలేక వీధులుబట్టి అన్నమో రామచంద్రా యని అల్లాడుతూ ఆర్తులమైన మమ్ముల రక్షింపక యింకా పరీక్షిస్తున్నావే తండ్రీ!

గీ. లేదు నీకంటె దయశాలి ♦ వేడుకొనగ
తోడునీడగ నడచ్చి, కా ♦ పాడువాడు
నాడు కరివేడ గంతిడి ♦ గోడుమాన్పి
నేడు తడయగా గతవేమి ♦ నుడువు శౌరి!

నోరులేని మృగాలుసైతం మొరపెట్టుకుంటే వచ్చిరక్షించావంటారు. నోరుకల్గి అనేక అర్ధాలొచ్చే మాటల్తో పూజిస్తూ ధ్యానిస్తూ మొరపెట్టుకుంటూవుంటే దయరాని కారణం మా ఖర్మం అనుకుంటాను.

రాము:—(రాముడు చేతికి కట్టు కట్టుకొని ప్రవేశించి) ఎవరో మీరు ఖర్మం గాదండీ, ఆ ఫిలిం నిన్నటితోనే ఆఖరు. వచ్చేది కల్యాణం. యీరోజే రిలీజు చేస్తారు. మా బావగారేగా తారా టాకీసు ప్రొప్రయిటరు.

సుగుణ:—ఎవరు నాయనా మీరు.

రాము:— మీరు, ఒహో, హోహో! సుగుణమ్మక్కయ్యా, మీరా ఎన్నాళ్ళ కెన్నాళ్లకు కనుపించారు. బావగారు బందిఖానా కెళ్లి నాలుగేండ్లు దాటిపోయింది. అబ్బో పులిపిల్ల! పులిపిల్ల! అల్లుడుగారా? కొంచెము పెరిగారే, అయ్యకుమళ్ళనే అన్ని మొక్కట్లూ, రాండి, రాండి అల్లుడుగారూ!

సుగుణ:— ఎవ్వరూ! మంజువాణీ తమ్ముడవా?

రాము:— అవునక్కా! బావచేసిన గందరగోళంతో కళావంతుల సంఘంలోకట్టుబాట్లు ఏర్పడ్డయిగా! కదుత్తే తప్పు. మెదులుతే తప్పు. అదిగాక మొన్నరాత్రి మా యింట్లో దొంగలు పడి మా అక్కవస్తువులు ఎత్తుకుపొయ్యారు. అడ్డం వెళ్ళినందుకు నాచెయ్యిరిగింది. యింకాస్తయితే ప్రాణమే పోయేది. ఏ తండ్రి కన్నాడోగాని కాస్త గట్టిశరీరం గాబట్టి ఆగగలిగాను. కట్టు కట్టిస్తున్నాను. కొంచెం స్వాధీనంలోకి వస్తూన్నది, దండం పెట్టినా, మృదంగం వాయించినా, కాళ్ళు పిసిగినా, అంట్లు తోమినా వకటే చెయ్యాయింది. (చేయి చూపును.)

సుగుణ;— అయ్యయ్యో! పాపం పాపం!! ఎవరో అన్యాయంగా కొట్టారు.

రాము:— పాపం అంటే పరాయవాండ్లెవరొస్తారక్కయ్యా, ఎవరో ఇంటిగుట్టు తెలిసినవారే యీ పని చేశారు. ప్రశ్న చూపించి కనుక్కొని పేగులు తీయించనా? ఎంతమందొచ్చినా

జీవనరావు బావలాగ డబ్బులగజిమ్మే బావను నేనుచూడలేదు. చూడబోను. అబ్బా! ఎంతపెట్టేవాడో అంత తన్నేవాడు కోపంవస్తే. పోనీ! చెప్తే చాలావుంది. ఎక్కడి కెళ్ళుతున్నా రమ్మా మీరు?

సుగుణ:—యిక్కడ మాకు తెలిసినవాండ్లున్నారు. అక్కడికి వెళ్ళుతున్నాం.

రాము:—(జేబులోనుండి రెండు రూపాయలుతీసి) యివిగో! అల్లుడిగారి కట్నం. రేపు నాయనవస్తే అల్లుణ్ని ఆదరించలేదా అని అణచిపెట్టి తంతాడు. మీరాయికోనుక్కో నాయనా!

సుగుణ:—ఆ! ఆ! వద్దు వద్దు. తప్పు తప్పు, తీసుకోకు నాయనా!

రాము:—అయ్యో! అక్కయ్యా! అట్లా అనకండి, ఆయన సొమ్మెంత తిన్నాం! ఈశరీరమంతా బావల వుప్పుతో బలిసిందేగా! అక్కా వద్దనకు.

(బలవంతముగా రెండురూపాయలు నళజీవనుని జేబులో వేయును.)

దండం అక్కా! పస్తీ చూపించటానికి పోతున్నా. వచ్చి కలుస్తాను మళ్లీ. (నిష్క్రమించును.)

సుగుణ:—పోదాం పద నాయనా! తూర్పువీధిలో ఒకసత్రం వుందని విన్నాను. ఈపూటక్కడ వుండీ రేపటి సంగతి ఆలోచిద్దాం.

(పాడుచు నిష్క్రమింతురు. యవనిక జారును)

---

## ★ పంచమరంగము ★

స్థలము : మంజువాణి మందిరము

(మంజువాణి నగలపెట్టెముందు కూర్చుని విచారముతో)

మంజు:—నగలన్నితీసి నవీన విటులతో నయకేళిసల్పుమని మా పెద్దలు చెప్పిన సూత్రం మరచిపోక కపటమోహంతో గడించిన కాసులుకాస్తా, మాకళ్లల్లో దుమ్ముకొట్టి కాజేసే ఘను

లెంతో మంది. ఈనెలలో మాయింటికొచ్చినవాళ్ళలో ఈ
దొంగతనం యెవరుచేసి వుంటారబ్బా!

రాము:—(ప్రవేశించి) వాడి అబ్బపేరు చెప్పిస్తా! తొందరెందుకే! (గడియారంచూచి) తొమ్మిదైంది. వస్తానేవుండవచ్చు అయ్యగారు. ఆయన అంజనం పడ్డదంటే ఆకాశానికి భూమికివుండే యేడేడు పద్నాలుగు పొరలు చినిగి యీావని చేసినవాడెవడో తక్షణం యిక్కతలికి వూడిపడవద్దూ!

మంజు:— ముగ్గుమీాదికి ఆయనచెప్పిన సామాను తెచ్చావా?

రాము:—(జేబునుండి కాగితముతీసి) కొంకాయలు2, నిమ్మకాయలు5 వేపాకు,విభూతి, దారపు కండె, సాంబ్రాణి, పసుపు, కుంకుమ దక్షిణ తాంబూలం యికపోతే ఒక గుడ్డుపెట్టే కోడి, మూడు బుడ్లు సీమసారాయి, ఒక చాకు, ఒక మేకు. అక్కా! ఇవన్ని సిద్ధం. ముగ్గుమీాద కూర్చుని తాయిత్తు పట్టి మంత్రం మొదలు పెట్టాడంటే దేవత గడగడలాడి వున్నది వున్నట్టు, లేంది లేనట్లు పలుకుతుంది.

మంజు:— రానీ! యిప్పుడే తేల్తుంది వ్యవహారం!

(ప్రవేశము:— అమృతానందుడు హరిరాం)

హరి:— అబ్బబ్బా! ఫలహారం! ఫలహారం! వ్యవహారం కంటే ముందు ఫలహారమే ప్రత్యక్షమౌతుంది యెక్కడికెళ్ళినా!

అమృ:— (త్రేన్చుచూ)ఓం శాంభవీ! భగవతీ! భారతీ!

(ముందునకు నడుచును)

రాము:— అయ్యా! అయ్యా! దండాలు. దయచేయండి.

[కుర్చీలు చూపును.]

మంజు:— స్వామీా! దాసురాలను. నమస్కారం దయచేయండి.

(గురుశిష్యులు కుర్చీలపై కూర్చుండి)

అమృ:— చోరహస్తగత ద్రవ్యప్రాప్తిరస్తు!

హరి:— తథాస్తు!

మంజు:— రామా! ఫలహారాల పళ్లెం పట్టుకరారా!

(రాముడు లోనికేగి ఫలహారముల పళ్లెముతో ప్రవేశించి)

రాము:— అయ్యా! అరగించండి. మహాత్ములు మీరు మాయింటికి రావటం మా అదృష్టం.

అమృ:— (ఫలహారం తింటూ) మహత్తు యేమిటిలే! అదంతా ఆ దేవీకటాక్షం!

హరి:— వుపాసనాబలం, మంత్రబలం, శాస్త్ర పరిచయం, స్వానుభవం యివన్నీ ఒక్క-చోట వుండబట్టి, మీలాంటి వాండ్లకు మహత్తు అనిపిస్తుంది.

రాము:—చూచావా అక్కా! ఆవాగ్ధోరణి; నిండుకుండ తొణుకుతుందా!

మంజు:—అయ్యా! నగలు తీసినవారిపేరు ఫలానా అంటూ కూడా తెలుస్తుందా! మరి.

అమృ:—మరీ! గిరీ! లేదే. వాడిపేరు, రూపం, లక్షణం, సొమ్ము వున్నచోటు, పోయిన టయిము, ఏంపోయింది, ఎంతపోయింది, ఎట్లాజరిగింది అంతా అరటిపండొల్చి చేతిలో పెట్టినట్లు చెప్తాను.

హరి:—ఆమాత్రం సామర్థ్యంలేకపోతేనే కోటీశ్వరులు, జమీందార్లు, వుద్యోగులు, వ్యాపారులు కళ్లకద్దంకొని కాళ్ళు మొక్కు-తున్నారూ! యింకావిను మహత్తు. పుత్రసంతానానికి బ్రహ్మదేముడు, సాముద్రికానికి ప్రహ్లాదుడు, ప్రశ్నాభాగానికి గణపతి, జోతిష్యానికి బృహస్పతి, సకల చిలిపిరోగాలకు అపరధన్వంత్రి, మంత్రశాస్త్రానికి మహాశుక్రుడు. నీయింటికొచ్చామని నిర్లక్ష్యంగా భావించేవుసుమా! వినూ! పట్టీలో సామానంతా తెప్పించారా?

మంజు:—ఆ, ఆ, అప్పుడే. యింత సేపా!

అమృ:—అయితే అన్నీ ఒకచోట పెట్టించు, నీసొమ్ము నీకాళ్ళలోకి వచ్చిపడేమార్గం చూపిస్తేనే సై అను.

మంజు:—లోపలిగదిలో ప్రయత్నంచేసి క్షణంలోవస్తాం కూర్చోండి.

(రాముడు మంజువాణి నిష్క్రమింతురు.)

(హరిరాం నలువైపుల తిలకించి అచటగల బల్లసొరుగులోనుండి ఒక కవరుదీసి అందు యేమోచదువుకొని యథాస్థానమున మరల యాపుత్తరమునుంచి కూర్చుండును.

(ప్రవేశము : రాముడు—మంజువాణి)

మంజు:—అయ్యా! అంతా సిద్ధం.

రాము:—అయ్యా! తంతు అంతా గదిలోనే జరిపి మళ్ళీయిక్కడకు దయచేసి ఒక దృష్టాంతరంతోపాటు, ఈపని చేసినవాని పేరు చెప్పండి. మీముగ్గురు మంత్రాలు చూస్తే మాఅక్కకు భయం వేస్తుందంట, లేవండి.

[గురుశిష్యులు రామునివెంట నిష్క్రమింతురు.]

(రాముడు మరల ప్రవేశించి)

రాము:— చూచావా! మందులు మంత్రాలు నమ్మనన్నావుగా! మనకుమాత్రం లేవా మరగేసుకోటానికి మందులుమంత్రాలు. నిరుడు మనం బెట్టిన మందుతో మతి చెడి మాన్యం అమ్మికీ కిచ్చి నిలవనీడ లేకుండా తిరుగుతున్నాడు నిమ్మల సీలయ్యచౌదరి.

మంజు:— నిజమే గాని మన మందులు మంత్రాలు ప్రజలమీద పారినట్లు ప్రజలు చేసిన ప్రయోగాలు మన మీద పారవని అమ్మ అంటూఉండేది. అందుచేత నేగా! 'కొక్కోకమెల్లజదివిన చక్కనివాడైన రాజచంద్రుండైనన్ మిక్కిలి రొక్కం బీయక చిక్కదురా వారకాంత' అన్నాడు కవి. అంటే యీ మాట స్వానుభవంమీద చెప్పాడని తెల్తుంది.

హరి:— (సారాయి గ్లాసుతో ప్రవేశించి) తేలింది! తేలింది! తీర్థం పోసేసరికి తిరిగిపోయిన దేవత తిన్నగా కూర్చుంది.

అమ్మ:—. (సారాయిసీసా గ్లాసుతో ప్రవేశించి) ఒకపట్టూ. తీరికగా కూర్చో. అడవిలోని వుసిరికాయకు, సముద్రపు వుప్పుకు జాడీలో సంబంధం కలిసినట్లు కలిసింది కథంతా.

[అంటూ గురుశిష్యులు సారాయి త్రాగుచూ సావకాశముగా కూరుచుండి]

అమ్మ:— హరిరాం! వీరికి ఒకదుష్టాంతరం చెప్పు. తరువాత తీసిన వాడిపేరు నేను చెప్పితే వీళ్ళకు నమ్మకం గలుగుతుంది!

హరి:—(మంత్రం) ఓం భగవత్ కాళీ శాంభవీ ఫట్, ఫట్ సభకట్ వాక్కుకట్, నేత్రకట్, హస్తకట్, పరప్రయోగకట్, బల్లకట్, పులవకట్, భూతప్రేత పిశాచకట్ శత్రు సంహారిణీ, పరవాక్కుబందూ, రాంబందూ, బీజబందూ, చెప్పు చెప్పూ నేను వింటూ!

(విభూతి మంత్రించుచూ గుగ్గు త్రిప్పి చిటికెలు వేయుచూ చెవియొద్ద చేయి నుంచి వినుచు)

ఒక్క వారం రోజులక్రితం, వరంగల్ వ్యాపారి నీ యింటికొచ్చి నీ కిక్కడ యిచ్చిందిగాక నీవు కోరిన వుంగరం చేయించి ఈ వూరి షావుకారు గుమస్తాద్వారా పంపించి, ముట్టిందా లేదా అని నీకు వుత్తరంగూడా వ్రాశాడా! లేదా? చాలా! యీ దృష్టాంతరం!

మంజు:—నిజం! నిజం! పంపాడు. వుత్తరం గూడా వ్రాశాడు.

(అంటూ పెట్టెలో వుత్తరంతీసి చూపి నవ్వి)

క్షమించండి అనుమాననివృత్తి కోసం అడిగానేగాని పరీక్షగాదు.

అమ్మ:—అయితే యిక అసలుసంగతి నేను బయటపెడుతాగాని! యీనెల శుద్ధపాడ్యమీ మొదలు బహుళ పాడ్యమీల వరకు మీయింటికి యేరోజు యెవరొచ్చారో చెప్పగలవా?

రాము:—(ఆలోచించుచు) పాడ్యమీనాడు పంతులుగారు, విదియనాడు విశ్వనాధం, తదియనాడు తాసిల్ ... ఆయన. చవితి నాడు చౌకీదారు. (ఆలోచించి) నాలుగురోజులు ఖాళీ. తరువాత అయ్యో యిది ఫకీరు వాని జోలి. యేనాడెవరేముద్ర వేసింది చెపటం యెలాగ?

అమ్మ:—సరి, సరి, గ్రహించాం! గ్రహించాం!

(అని తన జంధ్యమునకు కట్టబడియున్న పెద్దతాయెత్తునుతీసి బల్లపైనుంచి దానిపై సారాయిత్రాగెడు గ్లాసును బోర్లించి ధ్యానపూర్వకముగా మంత్రం)

ఓం యక్షిణీ, రక్షణీ, భక్షిణీ, శిక్షిణీ, కింకిణీ, మంకిణీ ఝుంకిణీ, బటానీ పుతానీ, వేశ్యలకు రాణి మంజువాణి

యింటికెవరెవరొచ్చింది, యెవరేమిచేసింది, యెవరెంతతీసింది, బైల్ పెట్టి, ఆజార దామోదరా చక్రవర్తి సిఖాద్యక్షులక్ ఆబద్ధు బైరాగులన్ జారచోరాదులన్ బట్టి సాధించి శోధించి బంధించు. పోయింది యేమైన యెక్కింత చిక్కునా దక్కునా యింక యేమైన పోతుంద వస్తుంద ఆనంద నళా పింగళా ఈ పెద్ద బంగళా ఏమూల యందున్న వెదికించు పలికించు యింపించు చూపించు (అని గ్లాసులో సారాయి త్రాగి గ్లాసు యథాపధిగా నుంచి) ఆలస్యమౌతుంది. యిదే పెద్దపేచీ! ఛీ! ఛీ! కర్ణపిశాచీ సన్యాసి గోచీకి ఓపెద్దబూచీ, ఓంశాంతి, ఓంశాంతి ఓంశాంతి.

(అని గ్లాసు చెవిదగ్గర నుంచుకొని)

పల్కు కర్ణపిశాచీ, ఆ! ఆ! ఆహా! తెలిసింది తెలిసింది. (రాముని సంబోధించి) మీయింట్లో షుమారు పదిరోజుల క్రితం, రాత్రి పదిగంటలవేళ మీరు బైట తలుపులు తీసి వుంచి యింట్లో భోజనాలు చేసేసమయంలో యిద్దరు దొంగలు మంజువాణీ గదిలో ప్రవేశించి పరుపుక్రింద వుంచిన బంగారుగొలుసు కాజేసి గదిలో పూరీలతో నింపి పెట్టిన టిఫిను గిన్నె తీసుకొని పారిపోయే సమయంలో గదిలోవున్న నీళ్ళచెంబు దొంగకాలికి తగిలి దొర్లిన చప్పుడు విని రాముడు అడ్డంవస్తే! దొంగచేతిలో దుడ్డుకఱ్ఱతో చేయివిరిగేటట్టుకొట్టి తప్పించుకొని పారిపొయ్యారు.

మంజు:— సత్యం! సత్యం!

రాము:—అంతా నిజం. జరిగిందంతే. చెప్పిందంతే, మా బోగపోళ్ళ పాటి దేవుళ్ళే బాబు మీరు నిజంగా! వాళ్ళపేరుబాబూ?

అమృ:— అదే! విను జాగ్రత్తగా! దొంగసొమ్ముతో ఆశ్రమాలు పోషిస్తూ దొడ్డవాడనుపించుకునే సారంగపాణి.

మంజు:— ఆ రెండవవాడుబాబూ?

అమృ:— వాడి శిష్యుడే!

మంజు:— నిజం! నిజం! వాళ్ళు చాలా రోజులక్రితం అనాథాశ్ర మానికి చందాలంటూ మా యింటికికూడా వచ్చారు.

హరి:— స్వామీ! సొమ్ము దొరికేమార్గం ఏదైనా వుంటే చూపండి. పాపం ఖర్చుభరిస్తారు!

అమృ:— ఈరోజే మా మంత్రబలంతో టిఫిను గిన్నె తెప్పించి యిప్పిస్తాంగాని గొలుసుకోసం వారంరోజులనా వ్యవధివుంది.

రాము:— వాడ్నినాకు చూపండిబాబు. వాడి గొంతుకొరికి, గొలుసు గుంజుకొస్తాను.

అమృ:— అదేమాటమీద కొన్నాళ్ళునావెంట వుండు. ప్రాణం బోయినా వాణ్ని వదలొద్దు.

హరి:— ఏంపరవాలేదు. మీ ప్రాణాలు పోయినా ఉత్తర క్రియలకు నే నుంటాను.

(లోపల తలుపు చప్పుడగును. అమృతానందుడు హరిరాం అదరి పడుదురు.)

రాము:— (లోనికి చూచి) పరవాలేదు! తారాటాకీసు యజమాని మా బావగారే.

అమృ:— అయితే మే మిక్కడ వుండకూడదు. అవతలి కెళ్ళిముందు జరిపే తంతు ఆలోచిద్దాం!

మంజు:— మంచిది మావారొచ్చారు. మాట్లాడి మళ్ళీవస్తాను.

అమృ:— మా మాటల కంగీకరించి మాకు శిష్యుడవైనందుకు ఈ తీర్థం పుచ్చుకో (అని గ్లాసులో బ్రాందీపోసి రామునకిచ్చును)

రాము:—(గ్లాసుకళ్లకద్దుకొని) మహాప్రసాదం (గడగడ త్రాగివైచి) మా అక్కను ఒప్పించి యెంతైనా ఖర్చుపెట్టే భారం నాది గురువా!

హరి:— త్రిమూర్తులం సమకూడాం. మనకు కానిపనియేముంది.

[అంటూ పై అర్థముతో పాట పాడుచు నిష్క్రమింతురు.

[యవనిక జారును]

---

# దీ న బం ధు

## తృ తీ యాం క ము

### ★ ప్ర థ మ రం గ ము ★

(ప్రవేశము: సుగుణ నవజీవనులు పాడుచు)

నవ:—ఆకలి ఆకలని నిన్నటినుంచి అల్లాడుతుంటే అంత అన్నం పెట్టించలేకపోయాడు యేమిదేవుడే ఛీ!

సుగుణ:—తప్పు! తప్పు! అల్లా అనకూడదు. ఆయనకు అనుగ్రహం కలిగిందంటే, క్షణంలో అన్ని కష్టాలు దూరంచేస్తాడు. కాబట్టి యెక్కువకాలం యింకా భజించాలి.

నవ:—రాత్రిగాక పగలుగాక మరొకవేళగూడా భజించబట్టినా బొజ్జలుపెంచి మేడలు కట్టడానికి డబ్బిస్తాడు భగవంతుడు?

సుగుణ:—అది వారి పూర్వజన్మ పూజావిశేషం.

నవ:—పూర్వజన్మలో గూడా వారు మనుష్యులే అయివుంటారా?

సుగుణ:—తప్పక అయివుండబట్టే పూజించ గలుగుతారు.

నవ:—నేను నమ్మనే! పూర్వజన్మలో వాళ్లు మనలాగ దరిద్రులై వుంటే; అన్నంకోసం అల్లాడుతూ తిరిగేటప్పుడు ఆదేవుడ్ని ధ్యానించటానికి తీరికేవుండేదిగాదు. భుక్తిజరిగితేగదా ముక్తి మాట. అని మొన్న సత్రంలో మాటింగుచేసిన తాతయ్య గారు చెప్పలేదా! నీవన్నట్లు వాళ్ళకే పూర్వజన్మ అనేది వుంటే, ఆజన్మలో వాళ్ళు ఏమృగాలో పక్షులో అయి వుండాలి. అప్పుడే యేపొలం పండివుంటే అక్కడి గింజలు, యేచెట్టు కాసి వుంటే దాని ఫలములు తింటూ స్వేచ్ఛగా తిరుగుతూ, చెట్ల చిటారుకొమ్మల్లో కూర్చుని హాయిగా యీల పాటపాడుతూ దేవుడ్ని ధ్యానించుకొంటూ ఈజన్మలో అదృష్టవంతులై పుట్టివుండవచ్చు.

సుగుణ:—నాతండ్రీ! నాలుగక్షరాలు నేర్చుకున్నందుకే నేను సమాధానం చెప్పలేని ప్రశ్నలు వేస్తున్నావు; బాగా చదువుకుంటే ప్రపంచాన్నే జయిస్తావురా నాయనా

(అని కౌగలించుకొని ముద్దిడును.)

నవ:—అమ్మా! యెల్లుండి దసరాపండుగని పిల్లలందరూ, క్రొత్త బట్టలు కుట్టించుకున్నారు. నీదగ్గర డబ్బు లేదని నాకు తెలుసు. నిన్నూ కష్టపెట్టను, గాని (చినిగిన చొక్కా చూపుచు) యీచొక్కాకాస్త కుట్టిపెట్టి పండుగనాడు యింత సబ్బు కొనిపెట్టావంటే, బాగావుతికి తొడుక్కొని పిల్లలతో కలిసి గుళ్ళో కెళ్ళుతా!

సుగుణ:—నాయనా! నాకు శ్రమకలుగుతుందేమోనని వున్నదాంతోనే తృప్తిపడుతా నంటున్నావు—నాతండ్రీ! యేం చెయ్యాను దరిద్రం, పాపిష్టి దరిద్రం. క్రూరాతి క్రూరులైన రాక్షసులను జయించి లోకాని కుపకారం చేసిన మహానీయులలో ఒక్కరైనా ఆకలితో గూడుకొన్న యీదరిద్ర పిశాచాన్ని హతమార్చివుంటే మన కీబాధవుండేదా? పోనీ ఆధునిక విజ్ఞానులైనా పరమాణుశక్తితో ప్రపంచాన్ని మాడ్చి పైకెగిరి చంద్రమండలంలో కూర్చుంటా మంటారేగాని అన్యథా ఆలోచించి లోక కల్యాణ దాయకమైన విజ్ఞాన సూత్రాన్ని కనిపెట్టకపోగా విజ్ఞానాన్ని నాశనం చేయగల వినాశకర పదార్థాన్ని కనుక్కొన్నాం అంటూ విఱ్ఱవీగి మానవత్వాన్నే మరచి పోతున్నారు. పాపిష్టికాలం, పిల్లవాడు నేను మొన్నటినుండి పస్తు. నాకళ్ళే తిరిగి పోతున్నాయి. పసివాని సంగతి దైవమే యెఱుగు.

(ప్రవేశము:- నవరాల వెంకటేశం)

వెంక:—రామ! రామా! యెక్కడా చూడండి యిదేమాట, ఈ పాపిష్టి కష్టకాలాన్ని యెన్నడు కట్టుక పోతాడోగాని! (ప్రకాశముగా) అమ్మా! యేవ్వూరు తల్లీ! యేమిటో కష్టం

వెళ్ళబోస్తూవున్నావు. విని విని విసుకు బుట్టి కాస్త దగ్గరకు వెళ్ళి పలుకరిద్దామని చక్కావచ్చాను.

సుగుణ:—(అనుమానించుచు) యేదో ఒకవ్వూరు. అందరి కష్టం లాంటిదే నాకష్టమూను! నీవెవ్వరు?

వెంక:—అమ్మా! నన్ను నవరాల వెంకటేశం అంటారు. (లోపల చూపి) యిదే మాయిల్లు, దుకాణం కూడాను, యీఅబ్బాయి కుమారుడా అమ్మా!

సుగుణ:—అవును.

వెంక:—పాపం ఘరానా పుటక దాచినా దాగుతుందా! బాగా బ్రతికినవారికే బహుకష్టాలు, చూడు తల్లీ! నీవు ప్రస్తుతం పుట్టెడు కష్టాలలో నిండివున్నావు. కొంత డబ్బు కావాలంటే ఒక చిన్నమార్గం చెబుతాను. కష్టం యెవరికైనా ఒకటే విను తల్లి!

సుగుణ:—(అనుమానించుచు) యేమిటా మార్గం!

వెంక:—అమ్మా నేను విగ్గులు, నవరాలు తయారు చేస్తాను. నాకు తలవెంట్రుకలతో చాల అవసరం వుంటుంది. తల నీలాలు యిచ్చేవారికి తగిన ద్రవ్యం యిస్తాను,

సుగుణ:—ఛీ! ఛీ! నీవు హైందవుడవేన? నీకు మతిపోయిందా యేమిటి, ముత్తయిదువులు తల వెంట్రుకలు తీస్తారా?

వెంక:—కష్టకాలంలో తిరుపతి దేవుడికి మొక్కితే ప్రాణం కాపాడి నందున పరమాత్మకు తల నీలాలిచ్చినట్లే ప్రాణాన్ని రక్షించు కొంటానికి పరుల కమ్మితే తప్పులేదు.

నవ:—అమ్మా! నేను నిలబడలేనే.కళ్ళు తిరుగు తున్నాయి, వళ్ళు తూల్తూంది, నేనిక్కడ కొంచెం పండుకొంటాను. నీవు మాట్లా డుతూవుండు.

(అని పడుకొనబోయి పడిపోవును.)

సుగుణ:—అయ్యో! నాతండ్రీ! యిదేంటి యిట్లా పడిపోయావు? శరీరమంతా చిరు చెమటలు పోస్తూవున్నాయి. నాయనా!

నాయనా! అయ్యో నా నవజీవన బాబూ (దిక్కులు తిలకించి) ఆకలితో అన్యాయమై పోతున్నావా? నాయనా!

వెంక:—అమ్మా! భయపడవద్దు. నేనూ పిల్లలు గలవాడ్నే; పిడుగు లాంటి పిల్లవాడు ఆకలి దెబ్బకు అడ్డంపడ్డాడు. భయంలేదు క్షణంలో వస్తా!

(నిష్క్రమించును.)

సుగుణ:—పట్టెడన్నం లేక పంచభూతాలూ శరీరాన్ని వదలి వేస్తున్నవా! తండ్రీ! (దుఃఖించును.)

(వెంకటేశం ఒక కప్పుతో పాలు ఒక గ్లాసుతో నీళ్ళు ఒక ఫలహారం పొట్లం పట్టుకొని ప్రవేశించి)

వెంక:—అమ్మా! మీరు కొంచెం జరగండి. నేనూ అనేక కష్టాలనుభవించాను. ప్రపంచం సంగతి నాకు తెలిసినట్లు మీ కేం తెలుసు.

(పిల్లవానిని లేవనెత్తి కొంచెం నీరు త్రాపి)

లే నాయనా! ఆకలైందా బాబూ! గొంతు యెండి వుంటుంది. ఈ పాలు త్రాగు (పొట్లంవిప్పి చేతికిచ్చి) కాలు అడ్డంపెట్టుకొని తిను. ఇది బజారు.

(నవజీవన్ తినుచుండును.)

సుగుణ:—నలుబదియారుకోట్ల జనసంఖ్యగల యీభరతఖండంలో ప్రతిరోజూ యెన్నిప్రాణాలు పట్టెడన్నంకోసం తపించి తరలి పోతున్నవో? ఆలోచిస్తే

సీ. ఫలహారములు పాలు ♦ పంచ భక్ష్యంబులు
నోడ లెరుంగక తిందు ♦ రొక్క కోటి
ముమ్మారు భుజియింత్రు ♦ ముప్పది లక్షలే
యిమ్మారు తినువార ♦ లేడుకోట్లు
రోజున కొకపూట ♦ భోజనంబును జేసి
పస్తులు పడియుంద్రు ♦ పదియు కోట్లు
మూనాళ్ళ కొకమారు ♦ ముక్కిన నూకల
మెతుకును గాంతు రె ♦ న్మిదియె కోట్లు

గీ. అన్నమో రామ యనుచుందు ♦ రైదు కోట్లు
కాయ గసురులు గంజితో ♦ కడుపు నింపి
కూడు గుడ్డకు అల్లాడి ♦ కూలుచుంద్రు
లెక్క చూడగ మిగిలిన ♦ బక్క జనులు.

వెంక:—నిజమే; తల్లీ! మర్యాదస్తులకు కష్టంవస్తే మగ్గిచస్తారు. నేను పూర్వం బాగా బ్రతికినవాణ్ణి. యిప్పుడు కష్టాలొచ్చాయి. డబ్బులేని అవసరం తల్లిలాగ యేదో ఒక వుపాయం బోధిస్తా వుండబట్టి కాలం వెళ్ళబుచ్చుకొంటూ వున్నాను. చూడు నాచొక్కా! (అని కోటు విడచి తాను తొడిగివున్న చేతులు లేని చొక్కాచూపి) యిట్లానే మర్యాదకు మగ్గేవారు కొందరు ఖండవా ఒకే భుజంమీద రెండు వారాలైనా వుంచుకొంటారు. అంటే ఖండవాతీస్తే దానికింద యే అతుకో, చినుగో వుండితీరాలి. యిదార్థానికి చూస్తే యిట్లా లక్షలు బైటపెట్టవచ్చు. యెవరి మరికూడ వాళ్ళు కాపాడుకోటానికి పాటుబడటం తప్పని యెవరంటారు? అందుచేత వుపాయంగా ఒక పాయ కత్తిరించి అందంచెడకుండా చేస్తా! బారునుబట్టి మంచి ఖరీదొస్తుంది, యిందువల్ల మీఅవుసరం కూడా తీర్తుంది. నాలుగేళ్లు కష్టపడి యీనసిగందును పెంచావంటే, నాలాంటి వారిని నలుగురిని పోషిస్తాడు. అబ్బాయి మొఖంచూడు, ఆగమై పోతాడు. నాకూ పిల్లలున్నారు. యిదిగో యీనాలుగు రూపాయలు పుచ్చుకోండి!

(అని బలవంతముగా రూపాయలు పిల్లవాని జేబులో వేయును.)

సుగుణ:—(ఆలోచించి) కానీ దైవ చిత్తం.

గీ. కన్నకొడుకుకు కడుపుకు ♦ గంజి కొరకు
నెత్తి సీలాల నమ్మిన ♦ నేర మగునె?
జఠర బాధకు నోర్వక ♦ జాగిలమును
గుడిచి నంతనె గాధేయు ♦ కులము చెడెనె.

(సుగుణ నవజీవనులు వెంకటేశంవెంట నిష్క్రమింతురు.)

## ★ ద్వితీయ రంగము ★

(స్థలము- సెంట్రలు జయిలు- ఆఫీసు బల్లపై కాగితములు సర్దుచూ ఒక జవానుండ జయిలు సూపరింటెండెంటు ప్రవేశము- జవాను శాల్యూటు చేసి నిలబడును. అధికారి కుర్చీయందు కూర్చుండి యేవో కాగితములు చూచుకొని)

జై॥సూ:—432! నీవు యీరిలీజు ఆర్డరును జయిలువార్డరుకుచూపి 27 నెం. ఖైదీని విడిపించి వెంటబెట్టుకొనిరా!

జవా:— చిత్తం!

(అని నిష్క్రమించి 27 నెం; గల బిళ్ళ మెడలో కట్టబడియున్న జీవనరావుతో ప్రవేశించును.)

జై॥సూ:—జీవనరావు! నేటితో నీ 5 సంవత్సరముల శిక్ష పూర్తి యైనది. యీ కాగితంపై సంతకంపెట్టి నీవు వెళ్ళ వచ్చును.

(జీవనరావు కాగితంపై సంతకంచేసి మెడలోని బిళ్ళ తెంచి బల్లపై పారవైచును.)

జై॥సూ:—జీవనరావ్! యికనుండి బుద్ధికలిగి జాగ్రత్తగా సంచరించు, గో! (Go) పో!

జీవన:—అది నీకనవసర ప్రసంగం. ప్రపంచంలో అందరూ జాగ్రత్తగా సంచరిస్తూ, సత్యాన్ని ధర్మాన్ని అమల్లోపెడితే, నీకీ వుద్యోగం వుంటుందా? నీ డిపార్టుమెంటుతోపాటు, కోర్టు కచ్చేరీలు ధర్మస్థత్రాల క్రింద మారిపోవా? యింటికెళ్ళగానే యిబ్బంది వుంటుంది. దారిలో ఖర్చుకూడా వుంది. మళ్ళీ యిన్కం (Income) ఏదైనా వచ్చేవరకు ఒక నెలఖర్చు యిప్పించండి! బాగుంటుంది!

జై॥సూ:—క్షమించండి! మీకు సమాధానాలు చెబుతూ కూర్చోటం మాపనిగాదు!

జీవన: — సెలవు.

(అంటూ సంతకం పెట్టిన పెన్ వుద్యోగి కివ్వకనే వెడలి పోవుచుండును.)

జై॥సూ:—ఏయ్! పెన్ తీసుక వెళ్ళుతున్నావ్, అప్పుడే మొదలా! అదియిక్కడ పెట్టు!

జీవన:—చిత్రం! చిత్రం! పొరపాటు.

(కలము బల్లమీనుంచి అటుగల గడియారమును దొంగిలించి నిష్క్రమించును.)

యవనిక జారును.

## ★ తృతీయరంగము ★

(స్థలము:— బజారు- అటనొక వీధిబడియందు నల్లబల్లపై హిందూదేశపటము గీయబడియుండును. సారాబుడ్డి చేత ధరించి జీవనరావు ప్రవేశము.)

జీవన:— గడియారం అమ్మిన డబ్బుతో యీ బుడ్డికొన్నాను. ఓహో! యెన్నాళ్ళ కెన్నాళ్ళకీ దీర్ఘరోగికి, పత్యం పెట్టినట్లయింది. బడికి సెలవు కావచ్చు, బల్లమీద భరతఖండం మిగిలింది, (సీసా చూచుచు) తపస్సు చేసే పిల్లికి యెలుక సాక్షాత్కారంలాగ వుంది.

సీ॥ ఏనాడు విడిపోయె ♦ విస్కీలు బ్రాందీలు
యీనాడు లభియింప ♦ నెంత హాయి
యేనాడు వీడితి ♦ యిస్పేటుముక్కల
యీనాడు సమకూడ ♦ నెంతసొంపు
యేనాడు డీజీల ♦ ఎంబ్రేసు చేసితో
యీనాడు లభియింప ♦ యెంతయింపు
యేనాడు యీజీగ ♦ యేపర్సుకొట్టితో
యీనాడు లభియింప ♦ యెంతయాసు

గీ॥ భార్యపుత్రులు ఏమైరో బ్యాడు లక్కు
యిపుడు నో మనీ టిఫినుకై ♦ యేది దిక్కు
లాంగు టైమైన లైఫులో ♦ లస్టు నిలచె
డేరు డెవిలునా నాకేల ♦ డిస్కరేజి

అబ్బా తలచుకుంటే మనస్సంతా చికాకైపోతుంది. చికాకైన మానసానికి స్థిరత్వం గలిగించాలంటే, ఒక పెగ్గేసుకోటం అత్యావసరం!

(సారాయిని త్రాగుచూ)

యింతకూ బ్రహ్మదేవుడికి తలకాయలో స్క్రూ లూజు(Screw Loose) అయింది. లేకపోతే భూమి మీద యినుము, బొగ్గు, వెండి, బంగారపు గనులతో కృష్ణా, గోదావరీ నదులు సృష్టిలో ఉన్నట్లే

గీ॥ యెన్ని వాగులు నదులు, యీ ♦ యిలను గలవొ
యెన్ని విధముల గుట్టలు ♦ యెన్నగలవొ
యిందు విస్కీకి ఒకనది ♦ యింపుగలిగి
సీకుముక్కల కొక కొండ ♦ చేయరాదొ!

నిజంగా ఒక విస్కీనది మౌంటు యెవరెస్టు (Mount Everest) మీద బుట్టి మంచుకొండలలోనె ప్రవహించి రిఫ్రిజినేటర్ (Refriginatcr) లో ఉంచబడిన ద్రవపదార్థంలాగ చల్లబడి అక్కడనుండి కాష్మీర్, పంజాబ్, యు. పి, (U. P.) రాష్ట్రాల గుండా నైజాము డొమీనియన్సులోకి దొర్లి, వీలు లేకపోయినా నదులు క్రాస్ (Cross) చేసి మద్రాస్, మైసూర్, మలబార్ గుండా కన్యాకుమారీ అగ్రం దగ్గర హిందూమహాసముద్రంలో గలిస్తే యెంత బాగుండేది! యిక యీనది అందుబాటులో లేకపోయినా అభ్యాసంగల వారంతా, భక్తులు కాశీ గంగా యాత్రలకు కదలి వెళ్ళినట్లే, కదలివచ్చి 24 గంటలు నదిలో బడి నానుతుండేవారు. హిందూమహాసముద్రంవరకు చేరిన యీ నదిని గొట్టాలద్వారా సిలోను, జావా, బోర్నియో మీదుగా పై దేశాల వారికి పంపితే మన దేశానికి ఆర్థికంగా యెంత లాభం?

[అని పైన తాను చెప్పినప్రకారం అచటగల హిందూదేశపటముపై సీమసున్నముతో గీయుచు కన్యాకుమారిఅగ్రమునుండి యితర దేశములకు ప్రత్యేక ప్రత్యేకముగా గీతలు గీసి, సంవత్సరమునకు లాభం అంటూ ఒకసంఖ్యను గీచి దానిప్రక్కన షుమారు పన్నెండు సున్నాలుచుట్టి బల్లపై మోపిన యెడమచేయి తీయబోయి పొరబాటున సున్నాలకుముందు వ్రాయబడిన సంఖ్యను చెరిపివైచి సున్నాలను క్రమంగా ఒకట్లు, పదులు, వందలు. అంటూ లెక్కపెట్టుచుండగా నవజీవన్ పాడుచు చేతితో ఒక రూపాయి నెగురవేయుచు ప్రవేశించి పాటను ముగించి జీవనరావును తిలకించుచుండ]

జీవన:—ఒకట్లు, పదులు, వందలు, వేలు, పదివేలు, లక్షలు, పది లక్షలు, కోట్లు, పదికోట్లు, అర్బుదాలు, శతార్బుదాలు, శంఖాలు, శతశంఖాలు, చక్రం. (అంటూ లెఖ్ఖపెట్టుచు త్రాగుచుండును)

నవ:—(లెఖ్ఖనంతయు విని పరిహాసముగా) నిజం. నిజం. సున్నాలకు ముందు సంఖ్య లేదు. ఆదాయమంతా చక్రాలే, కాబట్టి యిన్ని చిన్నచక్రాలకుబదులుగా ఒకటే పెద్దబండిచక్రం చుట్టితే మంచిదిగదా?

జీవ:—(వెనుకకు చూచి) ఓ వెరీగుడ్ బాయ్! చక్రాన్ని భాగిస్తే ఏమౌతుంది చెప్పూ?

నవ:— చక్రాన్ని భాగిస్తే బండి అసలే నడవదు.

జీవ:—వెరీ వెల్, వెరీ వెల్! యు ఆర్ వెరీ క్లవర్! నీచేతిలో దేంటి?

నవ:—యిది రూపాయి.

జీవ:—అరెరె! కొత్తరూపాయిలాగుందే! అయితే, యిది మోగదే యేది, యేది, మోగించు! మోగించు!

(నవజీవన్ రూపాయిని గోటిమీద మోగించగా క్రిందపడును. జీవనరావు క్రిందబడిన రూపాయిని బూటుకాలితో తొక్కిపెట్టును)

నవ:—అయ్యో! రూపాయి యేది?

జీవ:—(జేబునుండి సిగరెటుతీసి వెలిగించి) ఆవైపు దొర్లివుండవచ్చు. చక్రంలాగ కళ్ళుపెట్టుకొని బాగాచూడు! (మఱి వకవైపున జూపును.)

నవ:—(దీనంగా.) మా అమ్మ బియ్యం తెమ్మని యిచ్చింది. అయ్యో! అయ్యో! యీరూపాయిపోతే యీరోజు మేము పస్తుండాలి యేదీ, మీకాలుక్రింద పడినట్లుంది!

జీవ:—యు బ్లడీ షీట్! కాలు తియ్యమంటావు! వూరుకుంటే తల కాయ తీస్తానంటావు, షటప్!

నవ:—మీకు నమస్కారం చేస్తాను. కాలు తియ్యండి. (కాళ్ళవద్ద కూర్చుండి కాలుపట్టుకొని లాగుచుండును.)

జీవ:—అబ్బబ్బా! కాలు నొక్కేస్తున్నావు రాస్కెల్!

[అని ఎడమకాలితో తన్నగా నవజీవన్ క్రిందపడి లేచి]

నవ:—అమ్మా! కడుపులో తగిలింది కాలు; (అని ఏడ్చును.) కరుణ రించి కాలుతియ్యండి! రూపాయి కాలిక్రిందనే వుంది.

(అంటూ జీవనరావుచేయి పట్టుకొనును)

జీవ:—ఇదిగో రూపాయి (అంటూ జేబులో చెయ్యిపెట్టుకొని తీసి) యూ బ్లడీ ఫూల్

(అని నవజీవనుని చెంపమీద బలమైన దెబ్బకొట్టును.)

నవ:— (దెబ్బతో క్రిందపడి) అమ్మా! (అని ఏడ్చుచూ లేచి దూర ముగా బోవును.)

జీవ:— కావాలా యింకొక రూపాయి? (అంటూ చేయిజాచి ముందు నకు కదలగా)

నవ:— అమ్మా! చాలు చాలు!

(అని ఏడ్చుచూ నవజీవన్ పారిపోవును—జీవనరావు కాలిక్రింద త్రొక్కి యుంచిన రూపాయి తీసి గోటితో మ్రోగించుచు)

సీ. ఈ రూకయేగాదె ♦ యేడ్పించు నవ్వించు
మానవాళి నెపుడు ♦ మమతమీర
యీరూకయేగాదె ♦ యిల భోగ రోగాల
సంఘటిల్లింపగా ♦ సాధనంబు
యీరూకయెగాదె ♦ యే ప్రాణినైనియుగా
చంపింప రక్షింప ♦ జాలుజగతి
యీరూకయెగాదె ♦ నీలోక మెల్లెడల
తెలియంగ జూపెడి ♦ దివ్యశక్తి

గీ॥ మనిషి మనిషికి లంకెగా ♦ మధ్యనిలచి
జుట్టు జుట్టుకు ముడిపెట్టి ♦ జూలుపట్టి
తోలుబొమ్మగ నాడించి ♦ దూలయణచు
విశ్వరూపంబె రూకలో ♦ నిమిడె ననగ!

మనం బయటికి వచ్చిన తర్వాత రొక్కరూపంగా కొట్టింది యిదే! పైలాబోణీ! పంచకల్యాణీ! ఏచేతి బోణీ నిత్యకల్యాణీ! యీ బోణీతోనే లక్షలు రానీ!

(రూపాయి జేబులో నుంచుకొని)

డబ్బుంటేనే ప్రపంచం!

మ॥ గురుడున్, బంధుడమాత్యుడున్ సతి చెలీ♦కూర్మిన్ సుదాసుండుగా
తిరుగున్ తోడుగ దేశమేదైన తా ♦ దీర్పుంగదా వాంఛలన్
సరకున్ జేయుదు సార్వభౌములను యే ♦ సాయంబు వాంఛింపకన్
పరువున్ జాతియు ధీరతన్ఘనగుచున్ ♦ పాలించు విత్తంబె బో!

ప్రస్తుతం కొంచెం ఫలహారం చేసివద్దాం!

(అని పాట పాడుచు నిష్క్రమించును.)

---

# ★ చతుర్థరంగము ★

స్థలము:—వీధి

(ప్రవేశము:— సుగుణ పాట పాడుచు)

సుగు:— సీ॥ బీదలై వీధులన్ ♦ బిచ్చమెత్తెడివారి
బీడించు మనట్టి యూ ♦ భిల్లుడెవడో!
అంగంబుగప్పగా ♦ నంతవస్త్రము లేని
ఆర్తుల దోచెడి ♦ అధముడెవడో,
బుడుతల పోషింప ♦ పూటకు గతిలేని
మాతల నేడ్పించు ♦ మందుడెవడో
పసికూన నోటిలో ♦ పడనున్న పాలను
పాదంబునన్ త్రోయు ♦ పాపియెవడో
గీ॥ తినియు తినకను దీనుడై ♦ దిరుగు నాడు
ముక్కువచ్చులే యూరని ♦ ముద్దుతనయు
దయయు దాక్షిణ్యమాత్మలో ♦ దలప కకట
మోది యేడ్పించినట్టి యూ ♦ మూర్ఖుడెవడో?

ఎవ్వడైనా ఏమిలాభం! వాడ్ని నేను యేమైనా చేయగల్గు తానా! పొట్ట నింపుకోనీ, వా డెంత అష్ట దరిద్రంతో అలవ టిస్తున్నాడో? దుర్మార్గుడు నా బంగారు తండ్రిని కడుపుపై తన్ని చెవి పగిలి రక్తం స్రవించేటట్టు కొట్టాడు. నా తండ్రి కమితంగా జ్వరంవచ్చింది. నాబిడ్డను, కారణం లేని విరోధంతో పక్షులను వేటాడే బోయవానిలాగ హింసించాడే! కానీ! ఆ భగవంతుడే న్యాయాన్యాయములనుపాలించనీ! సత్యమే దైవ స్వరూపం అయితే వాని చేతులీనాడే రక్షకభటుల స్వాధీనం కానీ! నాకు నిజంగా మతిభ్రమ గాకపోతే! భగవంతుడు వానిని శిక్షించనీ, రక్షించనీ, దానివల్ల నాకేమి ప్రయోజనం? నా నవజీవనానికి ప్రస్తుతం ఏర్పడిన ప్రమాదం తప్పే మార్గం ఆలోచించాలి. అనాథనని చెప్పుకున్నా, అవసరం అయిన మందులు తెచ్చుకుంటేనే, శీఘ్రంగా ఆరోగ్యం లభిస్తుం దన్నారు డాక్టరుగారు. (చెరగులో కట్టుకొన్న చీటిని విప్పి) నాకిప్పుడు కావలసిన డబ్బు యెవరిస్తారు? ఒక గుడ్డిగవ్వకూడా లేదే? యేంచేయను; తలసీలాలు కొని, సుడిపడ్డ నా కొడుకు ప్రాణాన్ని రక్షించినట్లే, యిప్పుడుకూడా, నా ప్రాణాన్నయినా సరే కొనే అవసరం ఎవరికైనా గలిగితే, నా కొడుకు ప్రాణం ఆ డబ్బుతో రక్షింపబడుతుంది (చెరగుతో కన్నులు తుడుచు కొనుచుండగా)

(కండ్లజోడు తుడుచుకొనుచు జపానుదేశపు పండ్ల డాక్టరు ప్రవేశించి జోడు కండ్లకు పెట్టుకొని పత్రికను యిట్లు చదువుచు ముందుకు నడచి)

పం॥ డా:—చుంగ్ మేనా, పియా, కె, మె! కోబయాషి. (అంటూ కండ్లు తుడుచుకొనుచున్న సుగుణను చూచి ఆశ్చర్యముతో) ఛిం, మె, లో మో, నో, మారూ, (అనుచు మిగుల సమీ పించి) వై క్రయింగ్ (సుగుణ మౌనం) కన్ను! నిల్లు; ఏం?

సుగుణ:— (ఆతనికి ఒక్క చేత్తో వందనము సల్పి) అయ్యా! ఏమి లేదు- గాని యీ చీటిలోగల ఔషధాలకు సరిగ్గా ఎంత పైకం కావాలో దయచేసి చెప్పండి బాబూ! (చీటి చేతి కిచ్చును)

పం॥ డా:— (చీటిని చూచుచు) యాంటి సెప్టిక్ సీరమ్, గ్లూకోస్, డి, 25०/० 25 సి. సి. ఒన్ బాక్సు, యాంటి యిన్‌ప్లమేషన్ ప్లాస్టర్, అయిన్ అండ్ బటేవియాస్ (చదివి) కంట్రోల్ రేట్ 15 టు- 16. రూపీస్, బ్లాక్, 40 టు- 50 రూపీస్ ఓన్లి.

(సుగుణ దుఃఖముతో కన్నులు తుడుచుకొనుచూ)

సుగుణ:— అయ్యో! 15 రూపాయలేమోగాని పదిహేను పైసలు కూడా నావద్ద లేవు. యేది దిక్కు! మందు తెచ్చుకోని వారందరూ, మరణించవలసిందేనా? తప్పదా! మందభాగ్యురాలనగు నన్ను కాపాడవా? మహాదేవ! తండ్రీ! నా నవజీవనానికే అపాయం గలిగితే, నా ఆత్మ యీ పాడు శరీరంలో నిలుస్తుందా! (ఆలోచించి) అమ్మటానికి నా మెళ్ళో పసుపుకొమ్ముకన్నా అధికంగా యేమీ లేదే! మందులు కొనలేని వారు మరణించవలసిన మాయదేశమేనా యిది? హా! దైవమా! (అని దుఃఖించును)

పం॥డా:—న్నూ! కన్నునీల్లుయేం! నీపన్నుఅమ్ము పైసా, యిస్తా;

(సుగుణ కనులు తుడుచుకొనుచు దుఃఖించుచుండును.)

పం॥డా:—(డాక్టరు మరల) న్నూ, హియర్ (Hear) (చిటిక వేయుచు) పన్నుఅమ్ము. పైసా యిస్తా.

సుగుణ:—అయ్యా! తమమాటలు నాకు సరిగా బోధపడటంలేదు కొంచెం స్పష్టంగా చెప్పండి తెలుసుకుంటా.

పం॥డా:—పైసాకావాలా? (అని తనపండ్లను చూపుచు) మేం పన్ను డాక్టర్, రెండు పండ్లు అమ్మా, నొప్పి. నెత్తురు నో (No) స్లోలీ (Slowly) చట్, చట్.

(అని పండ్లనుపీకుట నభినయించుచు) పైసాయిస్తా. నొప్పి నో.

సారం:—(సారంగపాణి ప్రవేశము) నొప్పిలేని హృదయాలు రాతి విగ్రహాలకుగాని, మానవులకుండరాదని మాగురువుగారి మహదాశయం. దూరాన్నుంచి చూస్తున్నాను. ఈజపానువాడేదో అంటాడు. ఆమె యేడుస్తూంది, అసలు విషయం అడిగి తెలుసు

కోవడం నావిధి గదా? తోటిమానవుని దీనత్వాన్ని తెలుసు
కొని తోడ్పడినవాడేగా బంధువుడు! (ముందునకు నడచును)

సుగుణ:—(సారంగపాణికి నమస్కరించి) అయ్యా! వీరేదో, డబ్బిచ్చి నాపండ్లను కొంటానంటూన్నారు. కష్టసమయంలో అడ్డుపడి భగవంతుడిలాగ! మనదేశీయుడు కాడు, తెనుగు సరిగ్గా తెలియదు. (చీటిచూపుచు) యీమందులకు సరిపడే డబ్బు మాత్రం యిస్తే మహదానందంతో దంతాలు సమర్పిస్తానని తెలియజెప్పండి, మీకు నమస్కారం చేస్తాను.

(సారంగపాణి ఆమెచేతిలోగల చీటి నందుకొని)

సారం:—(పండ్లడాక్టరుతో ప్రకాశంగా) వాటీస్ ది మ్యేటర్?

పం॥డా:—అ యామ్ యె జపానీస్ డెంటిస్టు.

సారం:—అఫ్ కోర్సు.

పం॥డా:—ఐ హ్యేవ్, గాట్ యాఁ ఆర్డర్ ఫ్రమ్ ఎ యంగ్ ఫిలిం స్టార్. షి వాంట్స్ ట్రూ హ్యూమన్ టూత్, విచ్ మస్ట బి, లవ్లీ అండ్ సూటబుల్ టు హార్, సో, దిస్, పూర్ లేడీస్ టూత్, ఆర్ వెరీ బ్యూటిఫుల్ అండ్ సూటబుల్ టు హార్ సో, బై, ది, బై షి యీజ్ ఆల్ సో, యిఁ నీడ్ ఆఫ్ మనీ ఫర్ మెడిసన్స్ సో ప్లీజ్ కయిండ్లీ బార్గెయిఁ ఫర్ మి హార్ టూత్ యాజ్ చీప్ యాస్ పాసబుల్.

(I have got an order from an young film star, she wants true human tooth, which must be lovely and suitable to her, so this poor ladie's tooth, are very beautiful and suitable to her, so by the by she is also in need of money for medicines, so please kindly bargain for me, her tooth as cheep as possible.)

సారం:—(సుగుణ నుద్దేశించి)అమ్మా! నీపండ్లు యీపాపికి అమ్మడానికి సిద్ధపడ్డావా? నిజమా?

సుగు:—తండ్రీ! నా కుమారుని యెవ్వరో చేతిలోవున్న రూపాయి లాక్కొని చెవిమీద బలమైన దెబ్బకొట్టారు, అందేత పిల్ల

వాని కపరిమితంగా జబ్బుచేసింది. డాక్టరు వద్దకు తీసుక వెళ్ళితే యీమందులు త్వరగా తెస్తేనే, పిల్లవానికి అపాయం తప్పుతుం దన్నాడు. అనాధను! అవసరాన్నిబట్టి అస్థులు అమ్ముకొనే యోగంపట్టింది.

పం॥డా:—మిస్టర్ సెటిల్ యిట్ ఎనీ హౌ. ఐ విల్ పే యువర్ కమిషన్ అండ్ యు కెన్ యక్ట్రాక్ట్ సం థింగ్ ఫ్రమ్ హర్, హరీ అప్ హరీ అప్! (Mister settle it any how, I will pay your commission and you can extract something from her, hurry up , hurry up.)

సారం: షట్ అప్! షట్ అప్!

సుగు:—బాబూ రెండు పండ్లకెంత యిస్తానన్నారు?

సారం:—తనువులో ప్రాపిరుండగానే; యితరుల దంతాలు పీకి పొట్ట పోసుకొనే యీపరదేశ రాక్షసులు, ఔరా!

ఉ. చేగొనిపోవలేదె మన ♦ దేశపు సంపద నెన్నిమారులో
చేగొనిపోయి సస్యముల ♦ జేసి జెలంగరె జీవనంబులన్
చేగొనినారు రక్తముల ♦ జేకొని రక్కట సర్వశక్తులన్
చేగొని పోవనుండి రిక ♦ చిక్కిన అస్తుల పుస్తెలన్నహా

యిట్టి స్థితిలో నీకీతడు తటస్థపడ్డందుకు నేను ఏడ్వటమో, నవ్వటమో, తెలియడంలేదు. అమ్మా! నీపండ్లను అమ్మ మన్నాడా యీ లంకానివాసి, రాక్షసుడు. వీడి కండ్లమ్మితే నేను కొని తోడిస్తాను. దేశంగొడ్డుపోయిందా? నీవేమి భయ భయపడకు! మాఆశ్రమానికి తీసుకెళ్ళి డాక్టరును పిలిపించి నీ కుమారునకు యేవుపద్రవంలేకుండా చేస్తాను. భగవంతు డున్నాడు.

పం॥డా:—వై! వై! వాట్! వాట్!

సార:—డోన్ టాక్, యిఫ్ యు ఆర్ విల్లింగ్ టు గివ్ యువర్ అయిజ్ అయాం, విల్లింగ్ టు పర్చేజ్. మైండ్ దట్. షి యీజ్ మై సిష్టర్. గెట్ యెవే, డోం టాక్ నాన్ సెన్సు!

(Don't talk, if you are willing to give your eyes, I am ready to purchase mind that, she is my 'sister. Get away, don't talk nonsense.)

(పలుసార్లు అని బెదరించుచు తరిమివేయును.)

పం॥డా:—ఓ! ఓ! మై గుడ్ గాడ్. (అనుచు నిష్క్రమించును.)

సారం:—తల వ్రాత, ధర్మదేవత తాండవమాడే దేశంలో దంతా లమ్మి బ్రతుకవలసిన కారణం, ఆ కారణకర్తకే తెలియాలి; ఓ! దైవమా? నీకు దైవత్వం వుందని మమ్ములను కష్టపెట్టడం గొప్పగాదు.

గీ॥ చాలు చాలయ్య దేవుడా ♦ చాలు చాలు
చెప్ప వలదయ్య నీగొప్ప ♦ చెప్పబోకు
నీవు మనుజుండవేమైన ♦ నిలువలేవు
మాకు గల్గిన ఓర్పుబో ♦ నీకు లేదు.

ధర్మసంస్థాపనార్థం ప్రతియుగంలో జనిస్తానన్నావే! ప్రపంచంలో ఇప్పుడు నడిచే అధర్మంచాలదా? యింకా ఎప్పుడు వచ్చి రక్షించేది?

గీ॥ కష్ట సమయాల దేవుండు ♦ గాచుననుచు
వేదము, బైబులు, ఖొరాన్లు ♦ బోధసేయు,
మాదు దేశంబు, మల మల ♦ మాడుచున్న,
రాముడును, యేసు, అల్లాలు ♦ రా రదేమి?

వాడి చిత్రం వాడికే అర్థం అవాలి. తల్లీ! నీవు నా చెల్లెలు లాంటిదానివి. నీ సోదరుల మింత మంది బ్రతికుండగా మా ముందు పరాయి దేశస్థునికి నీవు పండ్లమ్మితే యీ అవమానం, అఖిల ఆర్యావర్తానికి చెందుతుంది గానీ, అమాయకత్వం అవసరం ఆవేసించివున్న నీకు గాదు. తల్లీ! రా వెళ్ళుదాం!

సుగుణ:—అయ్యా!

సీ॥ పలుబాధలొందుచు ♦ ప్రాణముల్ త్యజియింప
నుంకించు సీతను ♦ నేలినట్లు
పాంచాలి సభలోన ♦ భంగ మొందెడునాడు
పాలించినట్టి ♦ గోపాలు పగిది
బహువత్సరంబులు ♦ బండమై పడియున్న
గౌతమ సతిగాచు ♦ ఘనునియట్లు
మొసలి కోరలజిక్కి ♦ మునిగిచావగనున్న
నిభరాజు నేలిన ♦ నేతభంగి
గీ॥ యిపుడు నన్ గావ ♦ దీక్షతో నిలచినట్టి
దేశభక్తుడవగు నిన్ను ♦ దేవుడనుచు
క్షామదారిద్ర్య ♦ పాపముల్ సమసిపోవ
మ్రొక్కుచుంటిని ♦ ఓ పుణ్యమూర్తి నిన్ను.

(అని మోకరించి నమస్కరించును.)

సారం:— ఆ! ఆ! తల్లీ! తల్లీ! తప్పు తప్పు. నా విధినేను నెరవేరుస్తానన్నాను. ఒకడాక్టర్ను పిలిపించి ఆపత్కాలంలో ఆదుకొంటానన్నాను. ఒకడాక్టర్ను పిలిపించి ఆపత్కాలంలో ఆదుకొంటా ననడం సంజీవిపర్వతం తెచ్చి లక్ష్మణుని మూర్ఛనుండి లేపి నంతటి మహాపురుషుణ్ని జేౌతానా! వెఱ్ఱితల్లీ, అదుగో! యిప్పుడే ఒక బండికూడా అక్కడ నిలబడ్డది, నడవండి! నడవండి! ఆలస్యమౌతుంది. అదే బండిమీద పిల్లవానితో సహా ఆశ్రమానికి వెళ్ళవచ్చు. అక్కడ మీకన్ని సౌకర్యాలు లభిస్తవి.

సుగు:— నడవండీ, బాబూ! దేవుడు మిమ్ము రక్షిస్తాడు.

(నిష్క్రమింతురు.)

---

# దీనబంధు

## చతుర్థాంకము

### ★ ప్రథమ రంగము ★

స్థలము:— సత్యానందుని గృహము:—

(సత్యానందుడు గదిలో మంచమువద్ద కుర్చీపై కూర్చుండి యేదో వ్రాసికొనుచూ, ఆలోచించుచూ, తల పంకించి ప్రకాశముగా)

అనాథులై, ఆర్తులై, అనేక విధాలా, ఆపదలపాలైన ఒక్కొక్క వ్యక్తి కడగండ్లను తలంచిన మాత్రాన గుండె పగిలి పోతూంది. ప్రపంచానికే గాక, తనకు గూడా తానే తల్లి తండ్రియైన ఆ భగవంతునికి మానవుల కష్ట సుఖాలు, మనస్సుకెక్కడం మాటలా! కనుకనే యీ పద్యాలు నేను ప్రచురించే ఆర్తనినాదం అనే పత్రికకు వుచితంగానే తోచాయి.

గీ॥ పుట్టి పెరిగియు జీవించు ♦ నట్టిభక్కి
అనుభవించినవారికే ♦ అర్థమగును
పుట్టియుండని పరమాత్మ ♦ పుడమి జనుల
బాధ సాధల నెఱుగునే ♦ భజనపరుడ.

ఓ దైవమా ఒక్క రామావతారం యెత్తి, యెంత గాథరా పడ్డావో, తెలిసిందిగా యీ లోకమర్యాద! ఇంకా మా కెందుకు యిన్ని తిప్పలు పెట్టి పరీక్షించటం? అన్ని విధాలా అనుకూలం వుండిన ధనమదాంధుడగు మానవుడే అర నిముసం నిన్ను ఆత్మలో ధ్యానించ లేనప్పుడు ఆజ్ఞయని, ఆంక్ష యని, అస్వతంత్రతయని, దరిద్రమని, వ్యాధులని, బాధలని, అనేక యిబ్బందులతో అల్లాడే ఆర్తులు

గీ॥ కూడు గుడ్డకు, కొఱతను ♦ కూలద్రోసి
మాడు, కొంపను లభియించు ♦ మాసు దినగ

స్వేచ్ఛ గలుగంగ నేగాదె ♦ సేవ జేయు
మాకు దీరును లేకున్న ♦ మఱచిపోమె?

అంటూ వుంటే తప్పేంవుంటుంది కాబట్టి! నిజంగా భక్తులకు, అనేక కష్టాలు కల్పించి, సదా పరీక్ష చేసేవాడ్ని భగవంతు డనడం కంటె; పరీక్షకుడనడం బాగుండదా? (లోనికిచూచి) కారు మబ్బులుగప్పి మేఘాలు ఆవరించి, వర్షం ఆరంభించింది. రమ్య హర్మ్యాల్లో రగ్గులు కప్పుకొని కూర్చున్న, నాలాంటి వారికే చలి అనిపిస్తూ యుంటే, కడుపుకు లేక, కప్పుకోనడానికి లేక, వర్ష బాధకు తట్టుకోలేక, వర్షం తగ్గేవఱకు, పంచలో పడివుంటాం బాబూ! అంటూ, ప్రాధేయపడితే, లంకంత యిల్లుంచుకొని, లజ్జాభిమానము లేక, తోటిమానవుని తోలే స్తారు. అద్దెకు కొన్నాళ్ళు ఆత్మ తనశరీరంలో వుండి, అప్పు తీర్చుకొని, అవతలకు దాటిపోతుందని, ఎఱుగరు. ఏమిశాశ్వతం 'కట్టె గానికట్టె జీలకట్టె'' 'నేయిలేని కాయ నేతిబీఱ'! అన్నట్లు మానవత్వం లేక మేమూ మనుష్యులమంటే, ఆ పేర్లులాగనే హాస్యాస్పదంగా వుండదా? (లోనికి తిలకించుచు) వర్షం అధి కంగా వుంది. మెఱపు మెఱసినపుడెల్ల బయటి కిటికీవద్ద ఒక వ్యక్తి సాక్షాత్కరిస్తాడు. ఎవరై యుండవచ్చు చెపుమా? ఎవరైతేనేం! వర్ష బాధకు, పంచలో నిలబడి వుండవచ్చు! అదిగో! మళ్ళీ మెఱపు! మేలిముసుగు వేసికొని- నిల్చే వున్నాడు. వెళ్ళి విచారిస్తాను.

(అంటూ లాంతరు తీసుకొని లోనికి కని, తడిసిన ముసుగుతోనున్న జీవన రావుతో ప్రవేశించును. జీవనరావు చలిచే వణుకుచుండును. సత్యానందుడు జీవనరావు పైన కప్పుకొనిన తడివస్త్రమును, తీసి ప్రక్కనుంచి, తనపైనుండు తుమాలుతో యాతని తల తుడువ బోవగా)

జీవన:— అహాహా! అయ్యయ్యో క్షమించండి, నాకు పాపంవస్తుంది, నేను తుడుచుకొంటాను. (తుమాలును తీసుకొని తుడుచుకొను చుండగా)

సత్యా:— బాబూ! యిలా కూర్చో పరవాలేదు. (అని కుర్చీపై బలవంతముగా కూర్చోబెట్టి) చలితో వణకుతున్నావు. అయ్యయ్యో! యిప్పుడే లోపలికి వెళ్లి, స్టౌ వెలిగించి టీ కాచి తెస్తాను.

(నిష్క్రమించును.)

జీవన:—ఇదే! ఆశ్రమాధిపతి యిల్లు! తన యావదాస్తి అన్యాయంగా ఆశ్రమానికి యిచ్చిన పిచ్చి దేశభక్తుడు! అనేకమంది చందాలంటూ, విరాళాలంటూ, విరివిగా రొక్కంపంపుతూవుంటారు. యీాయన దగ్గిర వుండేదంతా రెడీక్యాష్. (Ready Cash) ఆయన వచ్చేలోపల యిల్లంతా ఒక్కరౌండు సింహావలోకనం చేద్దాం. (నాల్గువైపులా తిలకించి - సత్యానందుని, మంచము ప్రైగల తలగడఎత్తి, పదిరూపాయలనోటు, కొన్ని చిల్లర రూపాయలు వుండగా, జేబులో దాచుకొనుచూ) 'దిగ్విజైభవ' అంటే జేబు గరం జేయరా వెధవా! అన్నాడు మాసద్గురుడు. యెవరికెంత బాకీవుందో అంతా ఏవిధంగానైనా తీర్చుకోక తప్పతుందామటి. యింట్లోతిని యింటివాసాలు లెఖ్ఖపెట్టావంటే పెద్దలెవరైనా; తినని యింట్లో వాసాలలెఖ్ఖ తేలేదిఎట్లామటి. గురువుగారు పాపం, చలిపోగొట్టడానికి చా కాస్తున్నాడు. ఆకలి మంటను, కడుపులోవుంచుకున్న మాకు చలేంటి! అవసరమైతే, అసలు బ్రాందీ కొంచెంవాడితే చలి వదలి పులిగా మారిపోతాం! (జేబులోనుండి బ్రాందిసీసాతీసి అటు యిటూ, చూచి త్రాగి) పురాణాల్లో, మాత్రం ఏమేడ్చింది? ఋష్యాదులమంటూ, రూలుకు వ్యతిరేకంగా యెంతమంది నడిచారు. మహారాజైన హరిశ్చంద్రుడిన్ని అకారణంగా ఆ విశ్వామిత్రుడు ముప్పతిప్పలు పెట్టి, ముక్కు నేలకేసి రాయించాడు. నిజానికి నిజం! హరిశ్చంద్రనాటకంచూచి, మనం నేర్చుకోవలసిన నీతియేమిటంటే, అబద్ధం ఆడనందుకుగాను అలాంటి కష్టాలపాలు గావలసి వస్తుందని. (అటుయిటు చూచి) చావడిలోచేరి సరిచూచుకొనేసరికి, చక్కావచ్చాడు సన్యాసి. అతి

చమత్కారంగా, ఆయనకు సమాధానంచెప్పి తప్పించుకున్నాను. మన ప్రోగ్రామ్ మారిపోయింది. అయినా మనకేం నష్టం! వస్తే వేలకువేలు, పోతే కన్నపుకత్తి. పెట్టుబడిలేని బేరానికి నష్టమేరాదు.

(ప్రవేశము:- సత్యానందుడు చెంబుతో నీళ్ళు, పళ్ళెంతో ఫలహారం, కప్పుతో 'టీ' తెచ్చి జీవనరావు ముందుంచును,)

జీవన:—ఇంతరాత్రివేళ, అనవసరంగా తమకు శ్రమయిచ్చాను. క్షమించాలి.

సత్యా:—ఒక ఆత్మకు తృప్తికలిగించడం నా అదృష్టంకాదా? పుచ్చుకో బాబూ! నీపరిస్థితి చూస్తే, నాకు చాలా జాలి వేస్తుంది. అయ్యారుగారింటికి వెళ్ళవలసిన అత్యావసరం యీరాత్రి యేం కలిగింది?

జీవన:—వారికి వుదయం చీకటితోనే రైలుకు ప్రయాణం వుంది. మళ్ళీనాలుగు రోజుల వఱకురారు. నేను వెళ్ళేముందు మాయింటివద్ద కలిస్తే చీటివ్రాసి యిస్తాను. ఆచీటి ఫ్యాక్టరీలో చూపి పనిలో ప్రవేశింపమన్నారు. చీకటికి చాలా భయపడుతూనే బయలుదేరాను. తీరా యిక్కడికి వచ్చేసరికి వర్షానికి యింతకోపం వచ్చింది.

సత్యా:—వర్షానికి కోపంవస్తే వణికించేది బీదలనేగా! నేను బయట తలుపు వేయించడం ఎంతో దోషమైంది. ఆశ్రమానికి చెందిన ధనమంతా అక్కడే యినప్పెట్టెలో భద్రంగా వున్నప్పుడు నాస్వంతయింటికి యింత అష్టదిగ్బంధనయెందుకు? బాబూ! యిక్కడే హాయిగా పండుకొని, ఆరుగంటలకు లేచి వెళ్ళి ఆయనను కలుసుకో; ఒకవేళ ఆయన సహాయంచేయని పక్షంలో, నీకు తగిన ఆధారం దొరికేవరకు ఎన్నాళ్లయినా మా ఆశ్రమంలో ఆశ్రయం యిప్పిస్తాను.

(జీవనరావు లేచి పైబట్ట నేలపై పరచుకొని పరుండబోవును)

సత్యా:—(అతనిని వారించి) వెఱ్ఱివాడా! యిక్కడసోఫామీద పండుకో! నీవు యిక్కడవున్నంతసేపు యిది నీయిల్లుగా

భావించుకో (అనుచూ జీవనరావు భుజముపట్టి సోఫాపై కూర్చుండ పెట్టగా జీవనరావు పండుకొనును. తాను మంచముపై కూర్చుండి) అలసినట్లున్నాడు. శరీరం వాల్చగానే సొమ్మసిల్లాడు. నేను యిచ్చిన స్వల్ప ఆహారానికే, ఒక ప్రాణి యెంతో ఆనందించి తన్మయత్వం జెందింది. నేను జేసిందేముంది? సర్వలోకాలను ఒక్కడే రక్షిస్తున్నాడంటే వాడి శక్తి, లీల, దీనజన పోషణ దీక్షానిబద్ధత మహాత్యం వర్ణనాతీతం.

సీ. ప్రహ్లాదు గావగా ♦ ప్రఖ్యాతి గలిగెను
కరిని గాచినంత ♦ ఘనత హెచ్చె
నుడుతను గావంగ ♦ నూరూర మెచ్చిరి
వాయు తనయు నేల ♦ వరలె కీర్తి
కుబ్జనేలిన నిన్ను ♦ గుణవంతుడని రంత
పేదస్నేహితు గావ ♦ పేరు నిలచె
వాల్మీకి కావగా ♦ వచ్చెను బిరుదొకటి
భక్తుల గావగా ♦ ప్రభయె హెచ్చె

గీ॥ చేరి శరణనన్న వారల ♦ చేయిబట్టి
కూడి వేడెడు వారల ♦ కోర్కె దీర్చి
భక్తి పూజించు వారికి ♦ ఫలము లొసగు
శక్తి నీకెట్లు కల్గెనో ♦ యుక్తిపరుడ

(సత్యానందుడు నమస్కరించి పండుకొనును. కొంతవడి జీవనరావు దొంగనిద్ర నభినయించుచు మెల్లగా లేచి.)

జీవన:—— నిప్పంటి కంటికి నిదురరాదు. యెంతో సేపటినుంచి చూస్తున్నా? దీపందగ్గర బల్లి గూర్చొని, వెలుగుదగ్గరకువచ్చిన ప్రతి పురుగును పట్టి తింటూ పొట్ట నింపుకొంటుంది. యిన్ని జీవాలను ప్రతిరోజూ చంపుతున్నాంగదా అని దానికేమైనా కనికరంవుందా? ఒకవేళ బుద్ధితెచ్చుకొని ఆహారం మానుకుంటే ఆనాడే అల్లాడి చస్తుంది. ప్రపంచం అంతా యింతే. దోమను బల్లి తింటే, బల్లిని పిలి తింటుంది. యిట్లానే దోమను

కప్ప తింటూంది. కప్పను పాము తింటుంది. పామును దుప్పి తింటుంది. దుప్పిని పులి తింటుంది. పులి గుండె తినే రేచు కుక్కలుకూడా వున్నాయి. యిట్లా ప్రతిజీవి ఒకదాన్ని హింసించి ఒకటి బ్రతకాలె, బికాస్ (Because) గురువుగారు గుఱ్ఱు పెట్టి నిద్రపోతున్నారు. జాగ్రదావస్థకు రాకముందేయిల్లు చక్క బెట్టుతా! మరిచాను. యినప పెట్టెఆశ్రమంలో వున్నదన్నాడు. ఈసంగతిముందుగా తెలిసివుంటే ఈప్రోగ్రామ్ అక్కడేపడేది. అయినా, ప్రయత్నం చేద్దాం! యింత గొప్పవాడింట్లో అడుగు పెట్టినతర్వాత 'ప్రాప్తానుసారం' మంచో చెడ్డో దొరికితీరాలి! ఐ షల్ ట్రై మై లక్కు.

[అంటూ లోనికరిగి ఒక చిన్న పెట్టె తెచ్చి, అంత వెదకి, యేమియు లేకుండుట చేత మఱల నింకొక వైపు లోనికరిగి, గురువుగారి పూజాసామగ్రి వెండి పెమ్మెలు వెండిగంట పంచపాత్ర వుద్ధరిణి, ఒక శాలువాతో ప్రవేశించి భుజంమీదవుండే శాలువా క్రిందపరచి చేతిలోనిసామాను దించుచుండగా, దేవతార్చనగంట కదలి మ్రోగును.]

నోట్లో నాలుక, గంటలో నాగవాసము అనవసరంగా కదిల్తే అనేక యిబ్బందులు వచ్చిపడతాయి. దీన్ని మూటలో పెడ్తే ముందు ముప్పు వస్తుంది. చేతిలోనే వుండాలి. "యస్యజ్ఞాన దయాసింధో......"

(అంటూ గురువుగారికి నమస్కరించి మూట చంక బెట్టి నిష్క్రమించును.)

యవనిక జారును.

## ★ ద్వితీయ రంగము ★

(స్థలము:— వీధి,— ప్రవేశము: జీవనరావు ముసుగుతో పాట పాడుచు)

జీవన:— బ్రతుకు జీవుడా అంటూ బయటపడ్డాను. యిక, వీటిని కరగించి, కడ్డీ జేసే మార్గం ఆలోచించాలి.

(ముందుకు నడవగా పోలీసువిజిల్ వినిపించును.)

(విజిలు విని అదరిపడి) గృహస్థునికి గుడ్లగూబ అరుపువింటే ఎంత అశుభమో యిదీ మాకంతే! దుశ్శకున దోషనివారణార్థం, తిరోగమనం కర్తవ్యం.

(అంటూ వెనుకకు తిరిగి పారిపోవ ప్రయత్నింపగా మరల యీవైపు నుండి విజిలు వినిపించగా, నిలచి నిశ్చేష్టుడై)

"చిక్కాడయ్యా మిడతంభొట్లూ" అన్నట్టయింది వ్యవహారం. సందు సన్నదైంది, వేరేమార్గంలేదు. యిరుపక్కల నుండీ యిద్దరు వస్తూన్నారు. మంచి ఆయుధం చేతిలోలేదు. పారి పోతే ప్రమాదమేగాక పరువునష్టం గూడా! వుపాయంగా తప్పించుకోవాలి.

(అంటూ ముందుకు చూచుచూ, వెనుకకు నడుచుచుండ, వెనుకనుండి ఒక పోలీసు, ముందునుండి ఒకపోలీసు ప్రవేశించి)

నెం 1 పో:—హో! పట్టుకో! పట్టుకో! దొంగా! దొంగా!

(అంటూ యిరువురు జవానులు కలిసి జీవనరావును పట్టుకొందురు.)

నెం 1 పో:— (పిస్టలు చూపుచూ) పారిపోతివా చచ్చేదవు!

జీవన:— పారిపోయింతర్వాత చంపేదెవడ్ని నీ ముఖం? మర్యాదగా మాట్లాడు. పరిగెత్తడానికి దొంగననుకున్నావా?

నెం 1 పో:—(జీవనరావు ముసుగుతొలగించి,) ఓ హో హో! జీవన రావుగారా! చీకట్లో వేంచేశారు వెన్నెలదొరలు. యిదే రావడమా? వచ్చి వడేసుకపోవడమా?

జీవన:— (నవ్వుచు) ఛీ, ఛీ, అదంతా అప్పుడే మానేశానుగా! యెంత సంపాదించినా, మీరు తింటానికి మేము తింటానికే సరిపోయింది. వెధవ పని!

నెం 2 పో:— మరి యీ చంకలో మూట, యీ చేతిలోగంటేంటి?

జీవన:— ఆ! అన్నీమానేసి ఆయుర్వేదం నేర్చుకొని, హల్వాతయారు చేశాను. ప్రస్తుతం ప్రక్క గ్రామాల్లో, పెద్దలకు హల్వాయిమ్మి వచ్చేసరికి అర్ధరాత్రయింది. ఇదిగో! గంటకూడా, "బొంబాయి హల్వా, ఒంటికి చల్వా, అయిపోయిందల్వా, యిస్తానీతడవా!" (అంటూ గంట మోగిస్తూ) వుదయమే కనపడండి, చెరొక పావుశేరు పారేస్తా.

(అంటూ వెడలిపోబోవును. పోలీసులు అడ్డగించి సైగలుచేసుకొని)

నెం 2 పో:—అరెరె! ఆగాగు! యిప్పుడింత తొందరపనేముంది!

(అంటూ జీవనరావును పట్టుకొనును)

[జీవనరావు వెనుకకు తిరిగి జవానును నెట్టి పారిపోవ యత్నించును.]

నెం 1 పో:—ఇక ఆలస్యం జేస్తే అపాయం తప్పదు. కనురెప్ప పాటులో కంట్లో దుమ్ముకొడ్తాడు.

[అంటూ ముందుకువచ్చి రివాల్వరును జీవనరావు గుండెకెదురుగా వుంచి]

అడుగు ముందుపెట్టావంటే నీ ప్రాణంపోతుంది నిలబడు.

(అంటూ జీవనరావు చంకలోని మూటగుంజి యింకొక జవానుకిచ్చును. జీవనరావు నిశ్చేష్టితుడై నిలబడిపోవ మొదటి జవాను రెండవ జవానుతో)

నెం 1 పో:—విప్పవోయ్! చూడూ! ఏముందో అందులో, యిక్కడ పిస్తోలు తీస్తే పీకుతాడు తోక, క్షణంలో,

నెం 2 పో:—(మూటవిప్పి వక వస్తువుపై సత్యానందుని పేరుగాంచి) ఓహో! యిదా సంగతి! యింకా కాస్తయితే, బొంబాయి హల్వా తినిపించేవాడివే! పట్టుకోలేనందుకు వుద్యోగాలు వూడిపోతే చెరియొక గంటా, హల్వా పళ్లెం చేతి కిప్పించే వాడివే! వహవ్వా! ధర్మరాజునే దగా జేశావు. సత్యానంద స్వామి పేరు స్పష్టంగా కనబడుతుందిక్కడ.

జీవన:— ఎందుకీ యేడ్పంతా, ముగ్గురికీ మూడు భాగాలు పెట్టూం, ముడి పడిపోతుంది వ్యవహారం—

నెం1పో:—అబ్బో! ముడిపెట్టి తాడు తెంచి ముంచుతావా మాకొంప!

జీవన:— కేవలం మడికట్టుకొన్నట్లు మాట్లాడితే, చేతికొచ్చింది చెడి పోతుంది. మంచి మంచివారంతా లంచ, మంచాలకు తెలయొగ్గారు.

నెం 1 పో:—అనవసర ప్రసంగం కట్టిపెట్టు.

జీవన:— మూడు భాగాలు మీకు, వక భాగం నాకు.

నెం 1 పో:—ఇంకా కొంచం సేపు నీతో మాట్లాడితే మనస్సులు మార్చి, మరొకయింటికి దారి చూపే మహాత్ముడవు. చాలు చాలు.

జీవన:— పోనీ, అంతామీకే! నన్ను వదలిపెట్టండి. భగవంతుడు నాకిచ్చేది నా కిస్తాడు.

నెం 2 పో:—ఏమయ్యా 540 ఆలోచించు! వెండికి ప్రస్తుతం మంచి ధరేవుంది.

నెం 1 పో:—నీకు వెండిదయ్యం పట్టింది. యిక్కడ యిచ్చి అక్కడ చెప్పేవాడు, వద్దు! వద్దు! బాబూ!

జీవన:— ఇంకొక గంట టైమిచ్చాను. బాగా ఆలోచించుకోండి, యిదియె తుది సమయము త్వరపడుడు! బలే మంచి చౌక బేరము! ... ... ...

నెం 1 పో:—అతి తెలివి ప్రకటించావంటే, నీ చావు ముందు మా చావు వెనక, నడు. ఊ! తీసుకో! (అనిరివాల్వరునుచూపును) యివ్వరోయ్, మూట, (జవానును గద్దించును.)

(మూట తీసుకొని జీవనరావు ముందు నడువగా, పిస్టలు జీవనరావు వీపున కంటించి, పట్టి జవాన్లు వెనుక నడచుచూ ముగ్గురూ నిష్క్రమింతురు.)

## తృతీయరంగము

(స్థలము- సత్యానందుని గృహము సత్యానందుడు నిద్రించుచునే యుండును)

(ప్రవేశము- పోలీసు జవాన్లతో బంధింపబడిన జీవనరావు)

నెం1పో:—(దూరమునుండి) అయ్యా! బాబూ! అయ్యా! (చప్పట్లు కొట్టి పిలచును.)

సత్యా:—ఆ! ఆ! (లేచికూర్చుండి) ఎవరు? ఏమిటి! ఎందుకొచ్చారు?

నెం1పో:—అయ్యా! మీయింట్లో దొంగలుపడ్డారు. యిడుగోదొంగ! వస్తువులతోసహా మీయింటిప్రక్క సందులోనే అరెస్టు చేశాము. తాము యింకా నిద్రపోతూనేవున్నారు.

సత్యానందుడు మంచము నుండిలేచి జీవనరావు నొద్దకునడచి యాతనిముఖమును బాగుగాచూచును జీవనరావు సిగ్గుపడి తలవంచుకొనును)

సత్యా:—ఇతడు నాయింట్లో దొంగిలించాడని మెవరుచెప్పారు?

నెం1పో:—అయ్యా! ఒకరెండుకు చెప్పాలి, తమయింటి తలుపులు తీసివున్నయి. సామానంతా వెండిది; దానిపై మీపేరున్నది. యిటీవలనే యీతడు 5 సంవత్సరముల శిక్షకూడా పూర్తిజేసి విడుదలైనాడు. పోలీసువారికి యింతకంటె బలమైనకారణం యేంకావాలి! ఇదిగో! చూడండి మీసామానంతా!

సత్యా:—ఈతడు దొంగకాదు. (నవ్వుచు) యీసామానంతా యీతనికి నేను బహూకరించాను. నాయిష్టపూర్వకంగా యిచ్చిన సొమ్ము తీసుకవెళ్ళితే యిందులో నేరమేముంది?

(పోలీసులు తెల్లబోయి ఒకరిమొగము ఒకరు చూచుకొందురు.)

నెం2పో:—(ఒకటవనెంబరు పోలీసును సంబోధించి) నేనంటే విన్నావుగావు. యిప్పుడేం జేస్తావు చెయ్యి.

నెం1పో:—అయ్యా! క్షమించాలి, తమరే యిచ్చారని ఇతను మాతో ఒక్కసారైనా అనలేదే?

సత్యా:—సొమ్మునాది, యిచ్చినవాడనునేను. స్వయంగా చెబుతూ వుండగా, మీకు యింకా అనుమానం యెందుకు? వెంటనే వదలివెళ్ళండి; ఊఁ;... ...

(పోలీసులు జీవనరావును వదలి నిష్క్రమించుచు) అదృష్ట వంతుడవునాయనా కొండయెక్కావు (సత్యానందుని సంబోధించి) మహాత్మా! క్షమించాలి; శెలవు (అని నిష్క్రమింతురు)

(జీవనరావు తలవంచుకొని నిలబడియుండును.)

సత్యా:— శ్లో॥ అన్యాయార్జితం విత్తం దశవర్షాణి జీవితం
అథవా! ద్వాదశవర్షాణి సమూలం వినశ్యతి.

న్యాయంగా సంపాదించిన ధనం పదేళ్ళుంటుంది. లేదా పన్నెండుసంవత్సరాలువుండి 'సమూలం వినశ్యతి' క్రొత్తనీరు వచ్చి పాతనీరును కొట్టుకొనిపోయినట్టు సమూలంగా పూర్వార్జితాన్నికూడా నాశంచేస్తుంది. కనుక యీవెండిసామానులో అన్యాయంగా ఆర్జించినసొమ్ము ఒకగురిగింజ ప్రమాణమైన వుండితీరాలి. లేకపోతే యిదినాయింటినుండి తస్కరింపబడదు. అయినా! ఆభగవంతుడ్ని పూజించడానికి మనసేగాని మంచి

లోహాలెందుకు? వెండిని నిరుపయోగంగా దాచిన నా వెఱ్ఱితనా న్నంతా బయటపెట్టావు. ఇదంతా మార్చి ఆశ్రమానికి యివ్వని అపరాధం అద్దంలోనీడలాగ నాకిప్పుడు స్పష్టంగా కనపడుతూంది;

శ్లో॥ అదాన దోషేణ భవవే దరిద్రో
దారిద్ర దోషేణ కరోతి పాపం
పాపాదవశ్యం నరకం ప్రయాతి
పునర్దరిద్రోన పునరేవ పాపీః

ధర్మగుణం లేకపోవటంచేతనే దరిద్రుడై పుడతాడు. దరిద్రు డవడంచేత పాపకార్యాలు తప్పక చేయవలసి వస్తుంది. పాపంచేసినతర్వాత నరకానికి వెళ్ళకతప్పదు, అట్లా! నర కవాసం చేయడంచేత మళ్ళీ దరిద్రుడైపుట్టి, పాపంచేసి అనేక జన్మలు అవస్థతో ఆనందాన్ని ఎఱుగక అన్యాయమై పోతాడు. ''పరోపకారాయ సతాం విభూతయః'' ఈఅర్థంలేని మొద్దుపదార్థాన్ని అవసరంవున్నవాడికివ్వక నేనుఇక్కడదాచి అక్కడికి వెళ్ళితే అక్కడ అంతానవ్వరా! అడక్కుండా తీసు కెళ్ళటం అది నీతెలివితక్కువ, నేను యిప్పుడు భగదార్పణం అంటూ నీకిచ్చాను. తీసుకెళ్ళ భయంలేదు ఊ, నీఆత్మకు ఆనందం కలిగితే నీఆత్మను అనుసరించివున్న పరమాత్మ నన్ను దీవిస్తాడు.

జప—సీ॥ వివిధ విద్యలగాంచి ♦ విఖ్యాతి గన్నట్టి
దేశంబు నాదని ♦ దెలియనైతి
ధ్యే మూలదున్నినా ♦ నిక్షేపముగ పండు
దేశంబు నాదని ♦ దెలియనైతి
యే కంపమును లేక ♦ నెంతేని సుఖమిచ్చు
దేశంబు నాదని ♦ తెలియనైతి
యే మహాత్ముని గన్న ♦ నెంతేని ఫలమొదవు
దేశంబు నాదని ♦ దెలియనైతి

తే. భరతవర్షంబునను బుట్టు ♦ బండకేని
ముక్కనంతనె మోక్షంబు ♦ దక్కననెడి
ధర్మశాస్త్రార్థ మొక్కింత ♦ దెలియకకట
పరమ దుర్మార్గ వృత్తితో ♦ బ్రతికిచెడితి

జీవన:—(కంపించుచు అకస్మాత్తుగా, సత్యానందుని పాదములు పట్టుకొని గద్గదస్వరంతో) నన్ను క్షమించండి, చదువుకున్న దున్నపోతును. కుక్కకుండే విశ్వాసంలో, వెయ్యోవంతు లేని మహాపాపిని, దొంగను, హంతకుడను, దుర్మార్గుడను. ప్రపంచంలో న్యాయం ధర్మం సత్యం లేదనే నమ్మకంతో తిరిగే నామూఢవిశ్వాసాన్ని ముక్కలుగా నఱికివేసిన మహాత్ముడవు. నన్ను మన్నించకపోతే మఱియీప్రపంచాన్ని నేను యీకన్నులతో చూడలేను నేను చేసినపాప పరిహారంకోసం యిదుగో! పవిత్రమైన మీచేతులలో మెలగిన యీవుద్ధరణితో నాకళ్ళుతోడి ఆనీళ్లతో తమపాదాలు కడిగి పవిత్రుణ్ణవుతాను.

(అనుచు అచటనున్న పూజాసామానులోని వుద్ధరణితో కన్నులు పొడుచుకొనబోగా సత్యానందుడు వారించి వుద్ధరణి లాగుకొని)

సత్యా:—ఆగాగు! నీవు మొదటినుండి మనోనేత్రాలు మందగించిన మందబుద్ధివేకాక ఆత్మదృష్టిలేని అంధుడవు కూడాను. జ్ఞానేంద్రియములు లేని వానికి చక్షురింద్రియములు వుండియు లేనివానితో సమానమే! యిప్పుడు నీవు కన్నులున్న గుడ్డివాడవని యెఱుంగవు. అంతేగాదు తప్పుచేసిన శరీరాన్ని నీవుగాని మఱియొకరుగాని నిర్బంధించి శిక్షించునంతటి అవినీతి అవివేకం మరియొకటిలేదు.

బుద్ధి ప్రేరేపించడంవల్ల శరీరం పాపం జేస్తుంది. అందుచేత శరీరాన్ని శిక్షించి బుద్ధిని మార్చడం అసంభవం. నిన్ను శిక్షించిన వారందరూకూడా మానవత్వం తెలుసుకోబోయి మాయతత్వంతో దిగబడిపోయిన మందబుద్ధులు. ఒకవ్యక్తి

యొక్క బుద్ధిలో లోపంకనిపించినప్పుడు బుద్ధిమంతుడగువాడు తన బుద్ధికుశలతతో బుద్ధిహీనుని బుద్ధికి, బుద్ధితో శిక్షయిచ్చి సుగుణం కల్పించడం సక్రమమైన పద్ధతి. ప్రపంచంలో తల్లీ తండ్రీ గురుడు మఱియేయితర బోధకుడైనను ధర్మాన్ని బోధించిన పిదపకూడా, ఖిన్నవాడు పాపంచేశాడంటే బోధా లోపమేగాని బుద్ధిలోపంగాదు. అంటే బోధకుని బోధ శ్రోతకు సత్య ధర్మ విశ్వాసాన్ని కలుగజేసి అతని హృదయం పూర్తిగా మార్చలేకపోయిందన్నమాటే. అందుచేత గురువగు వాడు తనకుతానే అన్నివిధాలా బోధించుకొని సత్య ధర్మ విశ్వాసాన్ని ఆచరణలోనుంచి ప్రపంచానికి ప్రకటించి బాగు జేసే భారం బోధకునియందే వుంటుంది. యిది నాతప్పు! సత్యానందుని యింటిలో ప్రవేశించిన ఒక అజ్ఞాని, జ్ఞానాన్ని గ్రహింపక అజ్ఞానాన్ని మూటగట్టుకొనిపో వెళ్ళాడంటే లోకం నవ్వదా? యిదేగాక యింకా నీకు అవసరమైన వస్తువు యిక్కడ ఏమివున్నా తీసుకొనివెళ్ళు. సందేహించకు, నీతి నియమాలును దయాదాక్షిణ్యాలును, ధ్వంసంచేసే యిట్టి తుచ్ఛ పదార్థాలను యింకా నేను దాచను.

జీనవ:— (దీనంగా) దైవస్వరూపులు, దయచూపి అనేక సంవత్స రాలనుండి నాలో వృద్ధిపొందిన అజ్ఞానమనే అరణ్యానికి అగ్ని పెట్టారు. యీ అగ్ని క్షణ క్షణం, బ్రహ్మాండమైన జ్వాలలతో అజ్ఞాన భూజములను, ధ్వంసంచేస్తుంది. మంద బుద్ధినై మత్తు పదార్థాల అలవాటు వలన, పెద్దచిన్నలనక, స్త్రీ, పురుషు లనక మానవులను ఎన్నో విధాల బాధించాను, వేధించాను. ప్రపంచంలో, నీతి నియమాలు పాటించక తాత్కాలికసుఖం యేదైనా సరే చవిచూచి, చచ్చినవాడే అదృష్టవంతుడను కొన్నాను. ధర్మసూత్రాలన్నీ ప్రపంచాన్ని భయపెట్టడానికి వ్రాశిన, పిచ్చి కబుర్లను కొన్నాను. ఎన్నెన్ని ద్రోహాలు! ఎన్నెన్ని అపచారాలు! ఎందరికి చేశానో, ఎన్నిహృదయాలకు

అగ్గి బెట్టి నొప్పి కలిగించానో, ఆవుసురు, ఆ శాపం, ఆపాపం పండిందా? చూడండి...వారందరూ, అదుగో...అదుగో! నాముందు నిల్చి, ఎందుకో దూషిస్తున్నారు. అదుగో! అదుగో! ఆ! ఆ! తలకొక్కరాయి తీసికొని, నన్ను తరిమికొట్టున్నారు, నన్ను కాపాడండి, అయ్యో! నన్ను రక్షించండి, స్వామీ, (సత్యానందుని కాళ్లు గట్టిగా కౌగలించుకొని)నాకు సద్గురుడు లభించాను, మీజోలికిరాను. మీకు జోహారు! ఆ! ఆ! అరెరె! చూడండి చూడండి! ఆ అబ్బాయి, రాయి తీసుకొని, నాతల పగలగొట్టాడు, అబ్బా! బాధ...నొప్పి! నొప్పి! అయ్యయ్యో! రక్తం! రక్తం! అబ్బా!...మంట!

(అంటూ ఎవరో తన్ను రాతితో కొట్టగా తల పగిలి రక్తం స్రవించిన వాని వలె నటించుచూ, తలకు రక్తం లేకున్నను, చేతితో నద్దిచూపుచు)

చూడండి! చూడండి! న్యాయం చెప్పండి, యిదిగో రాయి.

(అంటూ అచటగల పంచపాత్రను చేత పట్టుకొని సత్యానందునికి వెట్టిగా చూపుచు రోదించుచుండగా)

సత్యా:—ఇప్పుడితను, పశ్చాత్తప్తుడైనాడు. ఒక్కసారిగా హృదయంలో మార్పువచ్చి మనస్సుచలించి మతిభ్రమ కలిగింది,

(అనుచూ అచటగల నీరుకొంచెం త్రాగించి విసనకఱ్ఱతో విసరుచూ వీపునతట్టి)

కళ్లు గట్టిగా మూసుకో మనస్సు శాంతిస్తుంది. భయంలేదు. (అంటూ ఆతని కళ్లు గట్టిగా మూయును.)

జీవన:— చేతులో రూపాయి లాక్కొని, చెంపమీద కొడ్తావా అంటూ చెయ్యి పట్టుకున్నాడు...చూడండి!... అమ్మదగ్గరకు రా! న్యాయం చెబుతుంది, అంటున్నాడు....మీరు చెప్పండి న్యాయం. ఏం, చెయ్యను! ఆకలి నన్ను అట్లా చేయించింది. తప్పు, ఆకలిదిగాని. నాదిగాదు......అవునవును! నిజం! నిజం కాదన్నానా? ఆకలి అందరికీ ఒక్కటే! నీవన్నట్లు, సత్యం, తెలిసింది. అబ్బాయీ! నీ రూపాయి తీసుకోను;నిన్నుకొట్టను.

మీా అమ్మతో చెప్పకు. ఆమె యెన్ని కొట్టిందో నిన్ను, అయ్యయ్యో! ఏడ్వకు, యేడ్వకు, (అంటూ ఏడ్చును.)

సత్యా:—ఇది చిత్రంగా వుంది, వుదయం, మా సారంగపాణి ఆశ్రమానికి తెచ్చిన అనాధబాలుని విషయమే అయి వుంటుందా? రూపాయి తీసుకోను, కొట్టను, అంటూన్నాడు. యీా గాధలో యేదో విశేషం వుంటుంది. భగవంతుడు నన్ను పరీక్షించడానికే యీా సందర్భంయిక్కడ సంఘటింపజేశాడా? యీాతనిని, కొంచం శాంతిపరచి, విషయమంతా తెలుసుకొందాం. (కన్నులు తడిబట్టతో తుడిచి నుదుట తడిబట్ట నుంచి, కొద్దిగా నీరు త్రాపుచు) నీవేం భయపడకు, నేను నీ వద్దనే వుండి, యిక్కడి కెవ్వరిని రానివ్వను. మనస్సు నిలుపుకో, కళ్ళు విప్పూ! నన్నుచూడూ! యింత చంచల హృదయుడవు, యిలాంటి సాహసకార్యాలు యింతకుముందు యెట్లు చేయగలిగావో నీకే తెలియాలి.

(జీవనరావు కొంతసేపు సత్యబ్ధముగా, వూరకుండి, సత్యానందుని చేతిలోని విసనకఱ్ఱను తీసుకొని)

అయ్యా! తమరా! యీాపని చేయడం, వద్దు! వద్దు! తప్పు! తప్పు! తప్పుచేశాను. దయచూపండి ధన్యుణ్ణి అవుతాను. జీవితం క్రూరమృగంలాగ గడిపాను. నా మానవత్వం మన్నయిపోయింది. భార్యాబిడ్డలకు తీరని అన్యాయం చేసిన మహాపాపాత్ముడను. నేను పశువునే, స్వామీా!

సత్యా:— భయపడకు. నాసర్వం ధారపోసి నిన్నుమనిషిని చేస్తాను. (అచటగల జాపితా గ్రంథమునుతీసి) వుదయం సారంగపాణి; కొడుకును రక్షించుకోడానికి, నోటి దంతాలు, అమ్మ సిద్ధపడిన అనాధను ఆశ్రమంలో చేర్చాడు. ఆమె పేరూ?

(అంటూ పుస్తకములోని పేర్లను వరుసగా జూచుచు)

ఆ! ఆమె పేరు, K. N. సుగుణ పిల్లవాని పేరు ...నవ...

(అనుచుండగా జీవనరావు విస్మయుడై)

జీవన:— K. N. నవజీవనేనా? నాతండ్రీ! నాకన్నతండ్రీ!
సత్యా:— అవునవును! తండ్రి పేరు K. N. జీవనరావు.
జీవన: ఆ! ఆ! హా! నేనే జీవనరావును. నా సుగుణ యీరోజు, మీ ఆశ్రమానికి చేరిందా? (అంటూ సత్యానందుని కౌగలించుకొనును) ఒక్కసారి నా భార్యను, కుమారుని, చూపించి నేను చేసిన యీ తప్పుకు నాకు పురిశిక్ష విధించండి. వప్పుకుంటాను. (కాళ్ళు పట్టుకొని దీనంగా) నాతండ్రిని, నా జీవనాన్ని, నాకు చూపి పుణ్యం కట్టుకోండి. మీకు అనేక జన్మాల, దాసాన దాసుడనై పడివుంటాను. (తన శిరము సత్యానందుని పాదముపైనుంచి బ్రతిమాలగా సత్యానందుడు లేవనెత్తును) బిడ్డను తెలుసుకోలేక, కొట్టిన పిశాచాన్ని నన్ను మనిషి అనటం కంటె, మహారాక్షసుడంటే మర్యాదగా వుంటుంది. రాక్షసుల్లో కూడా తనకన్ను తాను పొడుచుకున్నవాడు తన సొమ్ము తాను దొంగిలించుకొన్నవాడు యే కాలంలోగూడా వున్నట్లెరుగనే! నా పాపానికి పరిహారం వున్నదా? నాకు క్షమాపణగాని, ప్రాయశ్చిత్తంగాని, యేమత గ్రంథాల్లోనైనా లభిస్తుందా? నా సుగుణ గురువులాగ యెన్నిసార్లు బోధించింది. పెడచెవిని బెట్టినందుకు ప్రతిఫలం అనుభవించాను. నా కోసం యెంత విచారించిందో? యెన్ని యిక్కట్లనుభవించిందో? —నా జీవితాన్ని నేను చెడగొట్టి నాతోపాటు మఱిరెండు జీవితాలకు అన్యాయం చేశాను. తలచుకొంటే నా హృదయం పటాపంచలయిపోతుంది, నా నవజీవనాన్ని యీ పాపిష్టి చేతుల్తో, కొట్టిన దెబ్బకు పులకరం కూడా వచ్చిందట. (సత్యానందుని సంబోధించి) బాబూ! పదండీ! నా కన్నతండ్రిని నాకు చూపండి. నా హృదయనాళాల్లో చెప్పరాని తీవ్రత యేర్పడింది. మీ పవిత్రమైన పాదాలను, నా కంటినీళ్లతో కడిగేస్తాను. నడవండి.
సత్యా:— ఇది అర్ధరాత్రిసమయము. నీ కొడుకు క్షేమంగానే యుంటాడు. నీ కేం భయం లేదు. వుదయమే వెళ్ళుదాం!

యిప్పుడు మనం వెళ్లి వాళ్ల విశ్రాంతికి భంగం కలిగించడం మంచిదిగాదు. నీకుగూడా మనస్సు శాంతిస్తుంది. తెల్లవాఱు వరకు యిక్కడ విశ్రాంతి తీసుకో.

జీవన:— అయ్యా! తమవస్తువులు దొంగిలించి, యెవ్వరికి దొరకక అవి అమ్మగలిగితే, మళ్లీ నిషా వస్తువులు, సేవించి మైమరచి మహా ఘోరాలు చేస్తూ, భార్య బిడ్డల సంగతి పట్టించుకునే వాడనుగాను. దొరికినందుకు జైలు పాలైతే, భార్య బిడ్డలకు చెడి దూరమైపోయేవాడను. సత్యదయా స్వరూపులగు మీ పవిత్రమైన హస్తాల్లో, యిచ్చిన తీర్థ ప్రసాదాల మహిమయే, నన్ను మళ్ళీ తమ సన్నిధి చేర్చి, సంస్కరింప బడిన హృదయంతో సంసారంకూడే యోగం అబ్బింది. యిక శాంతితో పాటు, విశ్రాంతి లభింపనుండగా, యిక్కడున్నంతసేపు, మనసుకు వేదన ఎక్కువే యౌతుంది. యేనుగనిచ్చినవారు యెందుకు గడ్డి కుపేక్ష చెయ్యరని యెరిగి ప్రార్థిస్తూన్నాను. మీరు నడువ లేకపోతే మిమ్ములను నా బుజాలమీద కూర్చో బెట్టుకొని తీసుక వెళ్ళగలను.

సత్యా:—(నవ్వుచూ ఆశీర్వదించి) భగవంతుడు నాకు కాళ్ళిచ్చాడు. 'శుభస్యశీఘ్రం' పద. సర్వేశ్వరుడు యీరాత్రి ఆశ్రమానికి నడిపించటంలోకూడా అర్థముంటుంది.

(అని పాట పాడుచు నిష్క్రమింతురు.)

---

# దీ న బం ధు

## పం చ మాం క ము

### ★ ప్రథమ రంగము ★

—♦ ఆశ్రమ పరిసర ప్రాంతము ♦—

ప్రవేశము-అమృతానందుడు, హరిరాం, రాముడు. ముసుగులువైచుకొని త్రాగి తూలుచూ

అమృ:—(లోనికి చూపుచూ) అదే! ఆశ్రమం బయటిగోడ. అది జాగ్రత్తగాదాటి లోపలికెళ్ళాలి.

రాము:—(బిగ్గరగా) ఆ! ఆహా!

అమృ:—అరే, బిగ్గరగా మాట్లాడకూడదు. ముసుగు బాగాపెట్టుకోరా!

రాము:—మొగోడికి ముసుగెందుకండీ?

అమృ:—చూస్తాగా నీమొగతనం యిప్పుడు. యిక్కడముసుగుతీసినా, మనం లోపలికెళ్ళినతరువాత ఈ మాస్కులు కట్టుకోకతప్పదు.

[అంటూ మాస్కులుతీసి చెరియొకటియిచ్చి తనకొకటి యుంచుకొనును.]

హరి:—అయ్యా! యీమాస్కులే ఖాయంచేసి విభూతిపండ్లకోసం వెతుకులాడుకొనే ఖర్మం పట్టించకండి. హుషార్!

సత్యా:—విను! ముందు భయపెట్టిచూద్దాం. వినకపోతే పనిచేద్దాం. (రాముని సంబోధించి) ఒరే రామా! మేం మాత్రం మాట్లాడం. మాకంఠస్వరం వాడికి గుర్తు. యిచప్పెట్టితాళాలు అందేవరకు గుటక మింగనీయవద్దు. కత్తి తయారుంచుకో, అవసరాన్నిబట్టి నాఆజ్ఞ అవుతుంది. ఆజ్ఞానుసారం అమాంతం పొడిచెయ్యి.

హరి:—ఎవరిని పొడవడం తెలిసిందా? పొడవమనంగానే యీాన్ని పొడిచి చంపేవు! మెత్తిపారేయలేక ఎముకలు యిరుగతయి మనకు.

అమృ:—అరే ఖామూష్. తియ్యి సంచిలో తీర్థం. యిప్పుడు బిగించా మంటే మళ్ళీ వచ్చిందా కావుండాలి బిడ్డు.

(అని హరిరాముని చేతిలోగల సంచినివిప్పి అందలి సారాయిబుడ్లను తీయుదురు. సంచియందు యినప్పెట్టె పగులకొట్టుటకు పనిముట్లుకూడాయుండును. అందరూ కొంచెము కొంచెముగా త్రాగుదురు.)

అమృ:—(రాముని నీపుమీద తట్టుచూ) రామా! నలభీమా! మనతీర్థం పడ్డతర్వాత జంకు, జంఖానా దులిపిందా! యింకా విలచివుందా!

రాము:— బావల వృక్షంతో బలిసిన యీధీరుని పరాక్రమం యిప్పుడే చూడగలరు. పైగా తమ స్నేహంవల్ల సారాయి, పైమెట్టులో గల బ్రాందీలు వంటబట్టి అపరజీవనరావు ననే బిరుదు అయాచితంగా వచ్చి కూర్చుంది మీద.

హరి:—వాడెవడోయ్; పైకెత్తి మీద కెక్కించుకొన్నావు.

రాము:—ఎరగవా? ఆయన మాపాతబావ. ఆయన పేరు చెప్పితే యినప్పెట్టెల తాళాలు తమంతటతామే వూడి క్రింద పడతయి. దొంగ, దొరా, రౌడీ, పోలీసు, అందరికి సింహస్వప్నం. ధర్మదాత, పులిగుండె, అసాధ్యుడులెండి. మాఅక్క కెంత పెట్టాడు అట్లాంటివాడికే భయపడక కాళ్ళు గుంజకట్నం వసూలు జేసేవాడిని! యింకొకగ్లాసు పోసియిచ్చారా యింకొక గజంయెత్తు గోడకూడా పిల్లిలాగా దూకేస్తాను.

[రెండవ సీసాలోని సారాయిని మఱియొక గ్లాసు రామునకు పోసియిచ్చుచూ]

అమృ:— చూచావా? గ్లాసులో ఏం కనబడుతున్నది?

రాము:— అమృతానంద పాదతీర్థంలో అనేక అర్థాలతో నాట్యమాడే వెయ్యి బుడగలు.

అమృ:— ఆ! అనుకున్నపని అయింతర్వాత, నీతో వెయ్యి బుడగలంటూ గ్రంథం వ్రాయించి, నేను సవరించి, పత్రికల్లో వేసి, పది మందిలో నీ పేరు పైకి తెప్పిస్తాను.

రాము:— చిత్తం! చిత్తం! తమ అనుగ్రహం.

అమ్మ:— (బుడ్డిని చూపి, కదల్చుచూ)దీని ప్రభావం, యెంతైనా వుంది; శిష్యా! తలుచుకోరా తల్లిని! వెళ్ళుదాం!

[హరిరాం బ్రాందీసీసాకు మోకరించి కూర్చుండి నమస్కరించి దండకం]

హరి:— ఓ బ్రాంది పాత్రంబ, ప్రాణమిత్రంబ, ఓ పుణ్యక్షేత్రంబ, ఓ దివ్య రత్నంబ, ఓ స్వర్గసత్రంబ, మా జీవ రత్నంబ, ఓవర్ణ చిత్రంబ, మాధుర్య గాత్రంబవై, మమ్మేలు మాయంబ, లోకాంబ, కన్నాంబ, బ్రమరాంబ, దుర్గాంబ, లోలాంబవే, మాశక్తి, మారక్తి, మాభుక్తి, మాముక్తి, మా ప్రాణసూత్రంబవై, మమ్మేలు, మా దిక్కు మామొక్కు, యెక్కువైతే కక్కు, తక్కువైతే చిక్కు. యంత్రంబులోనీవు యేనాడు పుడుతావో, పీపాలలోనీవు యేనాడు పడతావో, సీసాలలోనీవు యేనాడు దిగుతావో, సీసాల సీలుతో బిరడాలు పీకేసి, గ్లాసులో వంచేసి, ఐసింత పడవేసి, సోడాతో కలిపేసి కాంక్షించి వుమ్మేసి, గట్టిగా కన్మూసి, గడగడా తాగేసి, నంజుడ్దైదైన నమిలేసి, మింగేసి, కైపెక్కి గంతేసి, తిన్నగా నిలుచుండి, ఆకాశముంజూచి, అరచేతితో తట్టి, జాడించి తెన్ను తుంటే, కింద్దైన, మీద్దైన, వళ్లంతయేమైన భయమెంతయును లేక, పైసాలు పడిపోయి, పైబట్టలేపోయి, పరువెంతపోయినా దుమ్మైన ధూళైన, నీరైన, నిప్పయిన, చప్పు చప్పునదాటి చెప్పులే పడిపోయి, చప్పలే విరిగినా, సాహసం బాత్మలో చక్కగా నిల్పుచూ, యెంతెంతపనినైన యింతలో జేయింతు వీవమ్మతోడు, మాయీడు, మాజోడు వారికీగోడు, అర్ధంబగున్ మాదేవి, —మాతల్లి—ఓ బ్రాంది, యేగాంధి మాటైన వినబోకు, మమ్మొడచిపోబోకు, ఎల్లప్పుడు నీకైపులో జోకు జోహారు! జోహారు! బేజారుకాబోకు, మా సర్వ సర్వంబు, మాప్రాణ ధారంబు, నీవెపో, యెక్కువే, అయిపోయి తక్కువే మిగిలావు! చల్లగా, మమ్మేలి, శాంతించు! శాంతించు! సాధించు! సాధించు! యీా వక్కసారీ, పోరి, పోరీ, దూరి, దూరి, యేరి కోరి, మాబ్రాంది శక్తి నమస్తే నమస్తే నమః!

అమృ:— ఒక్కటి. ......ఆలోచించుకో?... ...

సారం:— హే పన్నగభూషణా! ఆపన్నశరణ్యా! నా క్రియల్లోగాని నా వాక్కులోగాని, అసత్యం అధర్మం లేకపోతే, నన్ను యీ దుర్మార్గులనుండి రక్షించి, నీ కర్తవ్యం నెరవేర్చుకో!

అమృ:— ఒకటి; ... రెండు! దగ్గరకొచ్చింది.

సారం:— పరీక్షకు యిదే సమయము. నీవు నిజంగావుంటే, రా! రక్షించు!....... ...

(సత్యానందుడు ప్రవేశించి నివ్వెరపోయి)

సత్యా:— హా... ఖూనీ! ఖూనీ! ఆగండి! ఆగండి! .... ...

అమృ:— అదే సమయానికొచ్చాడు. పొడవరా ముందు వీడ్ని.

జీవన:— (లోపలనుండి) ఓరా! యీ జీవనరావు జీవించి వుండగా సత్యానందుని చంపువాడెవరురా?

(అనుచు ముందుకు దూకి, అమృతానందుని మెడబట్టి వెనుకకు పడగొట్టి వెంటనే హరిరాం మీదకు దూకును. జీవనరావుతో కలియబడి చాలాసేపు అమృతానందుడు హరిరామ్ పోట్లాడిన పిదప, జీవనరావు కుర్చీతో వారిరు వురను, పడగొట్టి, రామునికూడా కొట్టపోగా, మొదట జీవనరావును చూచి నప్పటినుండియే చేతిలోని కత్తిని క్రింద పడవైచి, వణకుచున్న రాముడు భయముతో)

రాము:— దండం బావా! దండం! దండం! నన్ను మాత్రం, రక్షించు! అసలు సంగతి బయట పెడ్తా. ... ...

జీవన:—(క్రిందపడియున్న కత్తిని అందుకొని) కదిలారా చచ్చారే!

(అని బెదరించుచు సారంగపాణిని బంధించిన త్రాడు సత్యానందుడువిప్పగా దానితో అమృతానందుని, హరిరాంను, రాముని బంధించును.)

సారం:— (జీవనరావుకు నమస్కరించి) భగవద్ ప్రేరేపణవల్ల గురువుగారితో సహా వచ్చి నాకు ప్రాణదానం చేసిన మిమ్ము భగవంతుడు రక్షిస్తాడు. నేనిప్పుడే టెలిఫోనుచేసి పోలీసువారిని పిలిపించి, యీ మానవపిశాచాలను వారి వశం చేస్తాను.

సత్యా;— ఆ పని నేను చూస్తాను! గాని నిన్న వుదయం నీవు మన ఆశ్రమంలో చేర్చిన సుగుణా నవనీతనుల, వెంటనే యిక్క-

డకు, పిలుచుకొనిరావాలి. ఈ వ్యక్తియే, సుగుణ భర్త;
నవజీవనుని తండ్రి. భార్యా బిడ్డలను చూడడానికి చాలా
ఆతురత పడుతున్నాడు.

సారం:—ఆ! ఆ! అట్లానా? అయితే యిప్పుడే తెస్తాను వారిని.
(లోనికి పరుగెత్తి సుగుణ నవజీవనులతో ప్రవేశించును.)

జీవన:—హా నా సుగుణా!

సుగుణ:—హా నా మనోజీవనా! (అనిఇరువురును కౌగలించుకొందురు)

జీవన:— (కుమారుని కౌగలించుకొని)

గీ॥ నిన్ను గుర్తించ నేరక ♦ కన్నకొడుక,
పట్టి కొట్టితి పాపిన్నై ♦ పశువురీతి
కడకు జేర్చెను నావను ♦ కాలదన్ని
గట్టు కూర్చుండి యేడ్చెడు ♦ ఖలుని భంగి.

నాకన్నతండ్రీ! యెన్ని పాపములు చేయబట్టో, నీ పాలబుగ్గ
లను ముద్దుగొంటూ, వచ్చీ రానీ మాటలు, కర్ణానందంగా
వింటూ, కనులారా చూచే భాగ్యం లేక కారాగృహం
పాలైనాను. నా చేత్తో నీకేమీ యివ్వకపోగా, నీ చేతిలోదే
లాక్కొని, ఆకలితో మండే యీ పొట్టకు పెట్టాను.

సుగుణ:— ఒకకుటుంబంలో కష్టం ఎవరికొచ్చినా ఒక్కటే, మీరు
ఆకలితో ఉన్న సమయంలో రూపాయి మీ కందిందనవింటే
నా ఆత్మ యెంతో చల్లపడ్డది. అటువంటి స్థితిలో తెలిసిగాని
తెలియకగాని, తండ్రికి కానుక నందజేసిన పుత్రుని జన్మ
సార్థకం అవుతుంది. మీకష్టమే, మాకష్టం. మీ సుఖమే
మాసుఖంకాదా? దీనికి మీరు సంతోషించాలిగాని విచార
పడకూడదు.

(అమృతానందుడు అచట పడియున్న కత్తిని మెల్లగా నందకొనుచుండగా
పోలీసులు ప్రవేశింతురు. వారినిచూచి అమృతానందుడు కత్తిని క్రిందపడవైచును.)

పో॥ఉ:—అయ్యా! ఆశ్రమంలో ప్రవేశించిన హంతకులు వీరేనా?

సారం:—అవును.

పో॥ఉ:—యీముగ్గురిని యెవరు బంధించ గలిగారు?

సత్యా:—(జీవనరావునుచూపి) ఈ మా నవీన మిత్రుడగు జీవన రావు, మా సారంగపాణికి నూతన జీవనాన్ని ప్రసాదించాడు.

పో॥ఉ:—దొంగల మర్మం యెఱిగిన దొర కావటంచేత, ఒకేసారి ముగ్గురుని బంధించ గలిగాడు.

(దొంగలను సమీపించి వారి కన్నులకు కట్టబడియున్న మాస్కులను వూడదీయును)

సారం:—ఓ,హూ! హూ! హూ! నమస్తే! నమస్తే! తమరా, అయ్యా! సత్రాలు కట్టిస్తున్నాం అంటూ చందాలు వసూలు చేసి సారాయి బుడ్లకు సమర్పించే ధర్మాత్ములు! (సత్యానందుని సంబోధించి) నేను చెప్పితే నమ్మారు కారు. యిప్పుడైనా నిజాన్ని గుర్తించండి.

సత్యా:—(ముక్కున వేలుంచుకొని) మనం ఒకరిని దూషింప కూడదు. వాళ్ళెన్నటికైనా మనసుమార్చుకొని సత్యాన్ని గుర్తిస్తే మళ్ళీ యిక్కడే మంచి స్థానం వీరి కుంటుంది. గోమానవ సంహారం అలవడిన మానసాలు మారటానికి కొంత వ్యవధికావాలి. అందుచేతనే వారు యిప్పుడు మౌనం వహించారు. (పో॥ఉ సెల్యూట్ చేసి దొంగలతో నిష్క్రమించును.)

జీవన:—నామనసు మారింది. నన్ను మీశిష్యునిగా మన్నించండి.

సత్యా:—నాయనా! విచారింపకు, మనస్సు మార్చుకున్నంతనే, నీది మరొక పరిశుద్ధమైన జన్మయింది. నీనూతన జీవితాన్నంతా మానవసేవకోసం అర్పించి నీవు తరించి యితరులను తరింప జేస్తూ, వుభయతారకానందాన్ని అనుభవించు!

సుగుణ:—తండ్రీ!

సీ॥ తినకట్టుకొనలేక ♦ దిరిపెమెత్తెడి వేళ
బంధుండవగుచు గా ♦ పాడితీవు
తలదాచుకొనలేక ♦ తల్లడిల్లెడు వేళ
బంధుండవగుచు గా ♦ పాడితీవు
ఘోరమహా వ్యాధిచే ♦ కూలనుండెడి వేళ
బంధుండవగుచు గా ♦ పాడితీవు

బంధువుల్ గాంచియు ♦ బల్కరింపని వేళ
బంధుండవగుచు గా ♦ పాడితీవు
గీ॥ ధనము దాచుటే ధర్మంబు ♦ బాచుటనుచు
సర్వభూతాళిలో నాత్మ ♦ సమమె యనుచు
దిక్కు లేనట్టివారల ♦ ప్రక్కనిలచి
దీనబంధుండ వైతివి ♦ దివ్యచరిత!

సుగుణ॥జీవనులు:—మహాపురుషా! దీనబంధూ! జీవితం అంతా మీా ఆజ్ఞానుసారం వర్తిస్తూ ఆశ్రమ సేవ జేస్తాం.

సారం:—నన్ను కాపాడి, మానవసేవను పాడిగించే, అవకాశం కలిగించిన మీాకు నా నమస్కృతులు.

నవజీవన్:— నాతండ్రిని నాకు చూపిన తాతగారి కాళ్లకు నమస్కరిస్తాను. (నమస్కరించును)

సత్యా:—"బుద్ధి కర్మానుసారిణీః అన్నట్లు, జరుగవలసినది యిట్లుండుట చేతనే, అర్ధరాత్రివేళ ఆశ్రమానికి రావలసిన అవసరం యేర్పడింది. యిందు మనకు ఆపరమాత్ముని కృపవల్ల జయము శుభమును సమకూడినవి. యిక మనము జీవితకాలమంతయు మానవసేవ జేయుచు తరింతుముగాక! యిక మనకువలయునది యేది?

సారం, జీవన, సుగుణ, నవజీన:— మీా ఆశీర్వచనము!

(అందరు నమస్కరింతురు)

సత్యా:—మంచిది! శుభమగుగాక!!

గీ॥ పగయు, మతభేద సమరముల్ ♦ విగతినొంది
క్షామదారిద్ర్యరోగముల్ ♦ సమసిపోయి,
ప్రేమ, ధర్మంబు సమతయు ♦ ప్రబలమొంది
జగము శాంతికి నిలమై ♦ నెగడుగాత!

ఓమ్ శాంతిః

మంగళమ్.